Ramanand Sagar's

# Ramayan

## PHOTO COMICS

**12 volumes. In Hindi and English**







**Published by**
**CHANDAMAMA VIJAYA COMBINES**
188, N.S.K. Salai, Vadapalani, Madras-600 026.



**Under licence from**
**SAGAR ENTERPRISES**
Natraj Studios, 194, Andheri Kurla Road, Bombay-400 069.






"మేము ప్రతిరోజూ ఎక్కువ పాలు కొంటాం"..




ప్యారిస్
మిల్క్ బిస్కట్లు

ప్యారిస్ మిల్క్ బిస్కట్లలో
ఎంతో పుష్టికరమైన పాలు...
పిల్లలకు ఎంతో ప్రీతి.

Artig/104

చక్కటి ఆరోగ్యానికి ఓరుచికరమైన అనుభవం






# 4 భారతీయ సాహసికులు

భయంలేని నలుగురు-యూసుఫ్ నాయకుడు-
గురుస్వామి తెలివైనవాడు-సాహసకృత్యాలకురికే
న్యాన్సీ, పరమ్ ధైర్యవంతుడు. ఎప్పుడూఏదోఒక
కొత్తదనంకోసం ఎదురు చూస్తారు
భారతదేశపు అందచందాలంటే అమితప్రేమ.

మూడు రోజులైంది ఈసంరక్షణకేంద్రంలో
ఇంతవరకు సైబీరియా కొంగలజాడలేదు.

ఇక్కడికి చేరుకో
వాలంటే 5,000 కి. మీ.
ఎగిరి రావాలి....
సూర్యుడు కొండలు
చెరువులు వాటికి
దారి చూపించేది.....
వాటి అరుపు
3. కి. మీ.. వినిపిస్తుంది...















అదుగో కొంగలు వస్తున్నాయి

కాని అవి దిగడం లేదు వెనక్కు పోతున్నాయి.

పరమ్ నాతోరా వీళ్లను ఆపుదాం

అయ్యా దయచేసి ఆపండి మీరచ్చకు పక్షులు భయపడి వెనక్కు పోతున్నాయి.

!!

అయ్యా బుద్ధిలేనివాళ్లు. మీరు వెంటనే ఆపకపోతే జైలుకు పోతారు నేను చెబుతున్నాను.

ఆమె చెబుతున్నది నిజమే. చట్టప్రకారం.

చట్టాలు మంచివే. కాని మనందరం కలిసి ఏదైనాచేస్తే తప్ప లాభంలేదు.

మీరిప్పుడు అదే ఋజువుచేశారు

పక్షులు మళ్లీ వస్తున్నాయి ప్రశాంతంగా..... నెమ్మదిగా... కిందికి దిగుతున్నాయి.

ఇదంతా మీ ధైర్యం వల్లనే.

భారతదేశపు అపురూపమైన అందాలు

మీరుకూడా మనపరిసరాలను అపహాస్యం చేసే బుద్ధిలేనివాళ్లను ఆపండి మనందరం కలిసి పనిచేస్తే మనదేశపు అందచందాలను శాశ్వతంగా పదిల పరచుకోవచ్చు.

HTA 6401TEL

Department of Tourism Government of India

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి
సంచాలకుడు : నాగిరెడ్డి

## కుల మత కలహాలు

మధ్యప్రదేశ్‌లోనూ, తమిళనాడు రాష్ట్రంలోనూ, దేశంలో మరి కొన్ని ప్రాంతాలలోనూ ఇటీవల కులకలహాలు కార్చిచ్చులా వ్యాపించి నానా బీభత్సం సృష్టించాయి.

మనిషిలోని మంచిని పెంచడానికని ఏర్పడిన మతాలు, ఇవాళ ఆవేశాలుగా మారి, మనిషిని మనిషి చంపుకునే ఆటవిక దశకు దిగజార్చుతున్నవి. ప్రకృతిలో ఎండా, వానా, గాలీ వెన్నెలా ఏదీ మనుషుల మధ్య తర తమ భావాలూ, కులమత భేదాలూ పాటించడం లేదు. కాని, సృష్టికి మకుటం అని చెప్పుకునే మనిషి మాత్రం—లేనిపోని కులమత ఆవేశాలకు లోనుకావడం ఎంతైనా విచారించతగ్గ విషయం.

ఈనాడు దేశవృక్షాన్ని కులమత తత్వాలు వేరుపురుగుల్లా వేధిస్తున్నాయి.

కులమత దురభిమానాలను కూకటివేళ్ళతో పెకలించి, మానవత్వం పరిమళించే సర్వమానవ సమానత్వం కోసం, విశ్వ మానవ శ్రేయస్సుకోసం కృషి చేయడం—భావిభారత పౌరులయిన మన అందరి కర్తవ్యం!

సంపుటి 85 నవంబర్ '89 సంచిక 5

విడి ప్రతి: 3-00 :: సంవత్సర చందా: 36-00









ఎన్నో మరెన్నో ప్యారీస్ మిఠాయిలు
పెద్దవి, చిన్నవి వినోదాల విందులు.

THE KING OF SWEETS

HTA 7124

## వార్తలు–విశేషాలు :



# వాయేజర్–**2** వినీల గ్రహ పయనం

సూర్యుడిచుట్టూ భూమితోపాటు బుధ, గురు, శుక్ర, కుజ, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో గ్రహాలూ, వీటితోపాటు అనేక ఉప గ్రహాలూ పరిభ్రమిస్తున్నవి. దీనినే సౌర కుటుంబం అంటారు. సౌర కుటుంబానికి కేంద్రం సూర్యగోళం అన్న సంగతి మన కందరికీ తెలుసు.

తనచుట్టూ వున్న వాతావరణంతోపాటు, గ్రహాంతర విశేషాలను తెలుసుకోవడానికి మనిషి నిరంతరాసక్తితో, నిర్విరామంగా కృషి

చేస్తున్నాడు. ఇందుకోసం అంతరిక్షంలోకి ఎన్నో రాకెట్లను ప్రయోగించాడు. నెప్ట్యూన్ గ్రహ విశేషాలను సేకరించడానికి అమెరికా ప్రయోగించిన వాయేజర్–2, నెప్ట్యూన్ గ్రహానికి సంబంధించిన సరికొత్త సమాచారాలను అంద జేసింది.

1977 వ సం॥ అగస్టు 20 న అమెరికా వాయేజర్–2 ను, రోదసిలోకి ప్రయోగించింది. అది పన్నెండేళ్ళ పాటు 4.43 లక్షకోట్ల (బిలియన్) మైళ్ళు ప్రయాణం చేసి నెప్ట్యూన్ గ్రహం పొలిమేరలకు చేరుకున్నది. సూర్యుడికి 280 కోట్ల మైళ్ళ దూరంలో వున్న నెప్ట్యూన్ గ్రహం వినీలవర్ణంతో అందంగా వుంటున్నది. నెప్ట్యూన్ గ్రహం చుట్టూ 5 వలయాలు ఉన్నట్టూ వాటిలో మూడు వలయాలు మరీ పలచనివనీ వాయేజర్ – 2 పంపిన ఛాయా చిత్రాలను బట్టి తెలుస్తున్నది. ఈ గ్రహం ఉపరితలంలో గంటకు 400 మైళ్ళ వేగంతో









తుఫానుగాలులు వీస్తున్నవి.

నెప్ట్యూన్ గ్రహం చుట్టూ, చందమామల్లాంటి 8 ఉపగ్రహాలు తిరుగుతున్నవి. వాటిలో పరిమాణంలో మన చందమామకన్నా కాస్త చిన్నదిగా వున్న 'ట్రిటాన్' అనే చందమామ అత్యంత మనోహరంగా కనిపిస్తున్నది. దీని నిండా మంచు వుండవచ్చుని భావిస్తున్నారు.

వాయేజర్–2 పంపిన సమాచారం ఆధారంగా, నెప్ట్యూన్ గ్రహం గురించీ, దాని ద్వారా సౌరకుటుంబం గురించీ మరిన్ని కొత్త విశేషాలను వెలుగులోకి తీసుకురావడానికి విజ్ఞాన వేత్తలు కృషి చేస్తున్నారు.



# అతితెలివి వ్యాపారం

వేములపాడు అనే జమీందారీ గ్రామంలో, భూపతి అనే రైతుండేవాడు. ఆయనకు గజపతి అని ఒకే కొడుకు. అతడు వ్యవసాయప్పనుల్లో అంతగా శ్రద్ధ చూపే వాడు కాదు. ఈ కారణంవల్ల, భూపతి చనిపోయేముందు కొడుకునూ, అతడి మేనమామ అయిన నాగరాజునూ దగ్గిరకు పిలిచి, ఒక రహస్యం చెప్పాడు.

అదేమంటే—గజపతికి తండ్రి ఆస్తిని అనుభవించే హక్కు తప్ప, అమ్మే హక్కు లేదు.

భూపతి చనిపోయాక, వరుసగా రెండు సంవత్సరాలపాటు, పొలాల్లో పంట పండ లేదు. ఆ తర్వాత, విపరీతమైన గాలి, వానదెబ్బకు పశువులపాక కూలి, పశువులు వరదనీటిలోపడి కొట్టుకుపోయాయి. పశువుల్ని కొనడానికీ, విత్తనాలూ, ఎరువులూ కొనడానికీ కూలివాళ్ళకు యిచ్చేందుకూ డబ్బు లేక, గజపతి పక్క గ్రామంలో వున్న మేనమామ దగ్గిరకు పోయి, అప్పుగా కొంత డబ్బివ్వమని అడిగాడు.

అందుకు నాగరాజు, "ఒరే, అల్లుడూ! ఈ రోజుల్లో వ్యవసాయం లాభసాటిగా లేదు. వర్షాలు సకాలంలో కురవడం లేదు. పంట చేతికి రావడం లేదు. నన్నడిగితే, వ్యాపారస్థులపని మెరుగంటాను. ఏదైనా వ్యాపారం ప్రారంభించు, లక్షలు సంపాదించవచ్చు," అని సలహా యిచ్చాడు.

"నాకూ అలాంటి ఆలోచనే వచ్చింది, మామయ్యా! కాని, నా దగ్గిర వ్యాపారానికి అవసరం అయిన పెట్టుబడి లేదే, ఏం చేయడం?" అన్నాడు గజపతి.

"అందరూ పెట్టుబడిపెట్టి వ్యాపారం చేస్తారనుకోవడం, నీ తెలివితక్కువ. ఎక్కువమంది అప్పు తెచ్చి వ్యాపారం మొదలుపెడతారు," అన్నాడు నాగరాజు.

వాణిశ్రీ



"నాకు వ్యాపారంలో అనుభవం లేదు. కర్మచాలక నష్టం వస్తే! సొంత డబ్బు అయితే పోయినా ఫర్వాలేదు. అప్పు తెచ్చిన డబ్బు పోతే ఎట్లా తీర్చాలి?" అని అడిగాడు గజపతి.

"తీర్చకపోతే ఏమవుతుంది?" అంటూ నాగరాజు నవ్వాడు.

"అప్పు తీర్చకపోతే, యిచ్చినవాళ్ళు వూరుకుంటారా?" అని అడిగాడు గజపతి.

"ఊరుకోకపోతే ఉరిపెట్టుకుంటారు. ఆస్తి నీ పేరవున్నా, నీకు అమ్మే హక్కు లేదు. కాబట్టి, అప్పు యిచ్చినవాళ్ళు నీ ఆస్తి స్వాధీనం చేసుకోలేరు," అన్నాడు నాగరాజు.

ఆ జవాబుతో గజపతికి, మేనమామ ఉద్దేశం అర్థమైంది.

ఆ తర్వాత నెల తిరక్కుండానే, గజపతి గ్రామంలో వున్న షావుకార్ల దగ్గిర లక్షవరహాలు అప్పు తెచ్చి వ్యాపారం మొదలుపెట్టాడు. గజపతికి ఇళ్ళూ, పొలాలూ వుండడంవల్ల, షావుకార్లు అనుమానించకుండా, అప్పులిచ్చారు.

గజపతి రైతుల దగ్గిర ధాన్యం, అపరాలూ కొని బళ్ళకు ఎత్తించి, పట్టణంలోని వ్యాపారులకు అమ్మేవాడు. అలాగే పట్టణంలో నుంచి చింతపండూ, నూనెలూ వగైరా తెచ్చి, పల్లెల్లో అమ్ముతూండేవాడు. అతడికి పరిస్థితులు అనుకూలించి, ఆ సంవత్సరం మంచి లాభాలు వచ్చినై. అప్పులకు వడ్డీ కట్టివేసింతర్వాత, అతడికి పదివేలవరహాల నికరాదాయం మిగిలింది.

అయితే, గజపతికి సంతోషం కలగలేదు. డబ్బు కళ్ళబడేసరికి, ఆలోచనలు పక్కదారి పట్టాయి. వ్యాపారంలో సంవత్సరానికి పదివేలవరహాలు మిగిలినా, అప్పు తీర్చడానికి పదేళ్ళు పడుతుంది. ఆ తర్వాత మరొక పదేళ్ళకు గాని, తను లక్షవరహాలు కూడబెట్టలేడు. తను లక్షాధికారి కావడానికి యిరవైఏళ్ళు పడుతుంది!

గజపతి, ఈ విధంగా లెక్కలుకట్టి అసంతృప్తి పెంచుకున్నాడు. తనకు

వ్యాపారంలో నష్టమొచ్చిందని, షావుకార్లను మోసం చేసి, క్షణాలమీద లక్షాధికారి కావాలని, అతడు నిశ్చయించుకున్నాడు. ఆస్తి అమ్మేహక్కు తనకు లేదు కాబట్టి, తనను ఎవరూ ఏమీ చేయలేరన్న ధీమా కలిగిందతడికి.

గజపతి లక్షవరహాలను మేనమామయింట దాచి, వ్యాపారంలో విపరీతంగా నష్టపోయి దివాళా తీశానని, నలుగురితో చెప్పసాగాడు. ఇది విన్న షావుకార్లు ఆరాతీసి, గజపతికి ఆస్తి అమ్మేహక్కు లేదని తెలుసుకుని, ఏమి చేయాలో తోచక జమీందారు దగ్గిర ఫిర్యాదు చేశారు.



జమీందారు రామారాయణంగారు, న్యాయాన్యాయాలను క్షుణ్ణంగా తెలుసుకుని తీర్పు లివ్వడంలో అందెవేసిన చేయి. ఆయన తన మనుషుల ద్వారా, గజపతి చేసిన వ్యాపారం గురించి వివరాలు సేకరించాడు. వాళ్ళు చెప్పినదాన్నిబట్టి, గజపతికి వ్యాపారంలో నష్టం వచ్చే అవకాశం లేదు. పట్టణంలోని వ్యాపారులెవరూ, అతణ్ణి మోసం చెయ్యలేదు.

ఒకనాడు జమీందారు, గజపతినీ అతడికి అప్పులిచ్చినవాళ్ళనూ పిలిపించి, గజపతిని, "నువ్వు షావుకార్ల దగ్గిర లక్షవరహాలు అప్పు తీసుకున్న మాట నిజమేనా?" అని ప్రశ్నించాడు.

"అయ్యా నిజమే. దానికి సంబంధించిన పత్రాలు కూడా వారి దగ్గిరున్నవి." అన్నాడు గజపతి.

"నీకు వ్యాపారంలో నష్టం వచ్చిందా?" అని అడిగాడు జమీందారు.

"నాకు వ్యాపారంలో అనుభవం లేక బాగా నష్టపోయాను." అన్నాడు గజపతి.

"నీకు ఆస్తి వున్నదన్న ధైర్యంతోనే, షావుకార్లు అప్పు లిచ్చారు గదా, ఏమంటావు?" అన్నాడు జమీందారు.

"నాకు ఆస్తిపాస్తులున్న మాట నిజమే." అన్నాడు గజపతి.

"ఇక నేం! ఆ ఆస్తిపాస్తులమ్మి అప్పులు తీర్చు." అన్నాడు జమీందారు కోపంగా.

గజపతి వణికిపోతూ, "అయ్యా, ఆ ఆస్తి అమ్మేహక్కు లేకుండా, నా తండ్రి వీలునామా రాశాడు. అనుభవించడానికి మాత్రమే, నాకు హక్కున్నది," అని, జమీందారుకు ఆ వీలునామా పత్రాలు చూపించాడు.

జమీందారు ఆ పత్రాలు చూసి, గజపతికి తిరిగియిస్తూ, "నువ్వు చెప్పింది నిజమే! కాని, నీ పొలాన్నీ, ఇళ్ళనూ అద్దెకు యిచ్చేహక్కు నీకున్నది. అందు వల్ల, వాటిని నూరు సంవత్సరాలపాటు నీ ఋణదాతలపరం చెయ్యి. ఆ తర్వాత నీ వారసులకు ఆస్తి చెందుతుంది," అని తీర్పిచ్చాడు.

తీర్పు విని గజపతి బెంబేలుపడిపోతూ, "అయ్యా, ఎంత లేదన్నా, నా ఆస్తి విలువ పదిలక్షలుంటుంది. లక్ష వరహాల బాకీకి గాను, అంత ఆస్తిని పరుల హస్తగతం చేయమనడం అన్యాయం," అన్నాడు.

ఆ మాటలకు జమీందారు నవ్వి, "లక్షవరహాలు అప్పు తీసుకుని తీర్చక పోవడం కూడా అన్యాయమే. ఆస్తి అమ్మే హక్కు లేనందున ఎవరూ ఏమీ చేయ లేరని, ఈ ఎత్తు వేశావు. ఇందులో మరెవరి సలహా అయినా వున్నదా?" అని అడిగాడు.

గజపతి కళ్ళనీళ్ళ పర్యంతమైపోతూ, "మా మేనమామ సలహా విని చెడ్డాను!" అంటూ జరిగినదంతా చెప్పాడు.

అప్పుడు జమీందారు, నాగరాజును పిలిపించి, "పెద్దవాడివైన నువ్వు, పని గట్టుకుని నీ మేనల్లుడికి పెడబుద్ధులు నేర్పి, అతణ్ణి మోసకారిని చేశావు. వెంటనే అప్పులిచ్చినవాళ్ళకు డబ్బు తిరిగి యిచ్చెయ్యి. ఇది మొదటి తప్పుగా భావించి, ఈసారికి నిన్నూ, నీ మేనల్లుణ్ణీ శిక్షించకుండా వదులుతున్నాను," అని చెప్పాడు.

గజపతి తను దాచిన డబ్బు తెచ్చి, షావుకార్ల బాకీలు తీర్చాడు. ఆ తర్వాత ఆ మేనమామ, మేనల్లుళ్ళకు మోసకారు లన్న పేరు మిగిలిపోయింది.






# 3

[శాంతిప్రియుడయిన సుమేధరాజు శాంతిదేవుణ్ణీ, రాణినీ, రెండేళ్ళ రాకుమారుణ్ణీ హత మార్చడానికి సేనాధిపతి వీరసింహుడు తన సహచరులతో కలిసి కుట్రపన్నాడు. విషయం తెలిసిన రాజు రాణినీ, కుమారుణ్ణీ రహస్య సొరంగమార్గం గుండా పంపివేశాడు. రాజు, వీరసింహుడి భటులతో ఒంటరిగా పోరాడి నదిలోకి దూకేశాడు. తరవాత—]

రాణి మెట్లగుండా కిందికి దిగి, కన్నీళ్ళతో పైకి చూసింది. అంతలోనే రాజు తలుపు మూసి వేశాడు. రాజును ఈ జన్మలో ఇక చూడలేనేమో అన్న భావం రాణి మనసులో బాధగా మెదిలింది. కొన్ని నిమిషాలక్రితం రాజదంపతులు ఎంత ఆనందంతో గడిపారు! ఇంతలో ఇటు వంటి దుస్థితి సంభవించగలదని ఎవరు మాత్రం ఊహించగలరు?

తన వెనక తలుపు మూసుకున్నప్పుడు రాణికి ప్రపంచమే మూసుకుపోయినట్టని పించింది. ఆమె జీవితంలో, ఇంతవరకు ఏనాడూ ఒంటరిగా పయనించి ఎరుగదు. రాకుమారిగా జన్మించి, అల్లారుముద్దుగా పెరిగి ధర్మపరుడయిన శాంతిదేవుణ్ణి వివాహమాడి రాణిగా శాంతిపురానికి వచ్చిన ఆమె ఎక్కడికి వెళ్ళినా, వెంట చెలికత్తెలు వెళ్ళేవారు!



సొరంగమార్గం తడితడిగా ఉన్నది. గాలి ఆడటం లేదు. ఏదో కాలికి అడ్డు తగలడంతో రాణి తూలిపడబోయి, ప్రయత్నం మీద నిలదొక్కుకున్నది. కాని, ఆమె చేతిలోని కాగడా ఎగిరి దూరంగాపడి ఆరిపోయింది. చుట్టూ గాఢాంధకారం. ఏమి చేయడానికీ తోచక ఆమె అలాగే నిలబడిపోయింది!

కొంతసేపటికి ఆమె కళ్ళు చీకటికి అలవాటుపడ్డాయి. దూరంగా వింతవెలుతురు ఆమె దృష్టి నాకర్షించింది. ఆమె మళ్ళీ మెల్లగా ముందుకు నడవసాగింది. మార్గానికి పక్కగోడలో పొదగబడిన మణి నుంచి ఆ వెలుగు ప్రసరిస్తున్నది. మార్గం పొడవునా అటువంటి మణులు అక్కడక్కడా కనిపించి ఆమెకుదారిచూపాయి.

ఆమె మౌనంగా రోదించింది. ఒడిలో బిడ్డ ఆదమరచి నిద్రపోతున్నాడు. బిడ్డ మేలుకోరాదని, రాణి, చేతిలోని కాగడా వెలుగులో జాగ్రత్తగా మెట్లు దిగి సొరంగ మార్గం చేరుకున్నది. రెండుమూడు గజాల దూరం తప్ప ఆమెకేమీ కనిపించడం లేదు. కాటుకలా చీకటి కమ్ముకుని ఉన్నది. సొరంగమార్గం బండలమధ్యగా తొలచబడినది. రాజప్రాసాదాన్నే, చదును చేయబడిన కొండమీద నిర్మించారన్న విషయం రాణికితెలుసు. ఇప్పుడామె కొండ లోపలి సొరంగమార్గంలో పయనిస్తున్నది. ఇంకా ఎంతదూరం పయనించాలి? ఈ మార్గం ఎక్కడికి తీసుకుపోతుంది?

ఇంతలో బిడ్డ నిద్రలేచాడు. ఆమె బిడ్డను రొమ్ముకు అదుముకుని, నిద్రపుచ్చుతూ, వేగంగా నడిచింది. క్రమంగా రాణి బాగా అలిసిపోయింది. అడుగు తీసి అడుగువేయడం కూడా ఆమెకు సాధ్యం కాలేదు. అయినప్పటికీ, సొరంగ మార్గం నుంచి ఎలాగైనా బయటపడా లన్న పట్టుదలతో, రాణి ప్రాణం బిగబట్టి నడవసాగింది.

ఆఖరికి ఆమె సొరంగం చివరకు చేరుకున్నది. కాని వెలుపలికి వెళ్ళే

మార్గం ఏది? ఎదురుగుండా అడ్డుగోడ కనిపించింది. గోడ మధ్యగా కాంతివంత మైన రాతిపలక అమర్చబడి ఉన్నది. రాణి శక్తినంతా కూడగట్టుకుని దాపున నున్న మణిని రెండు మూడుసార్లు కదిలించింది. రాతిపలక పక్కకు తొలగింది. అక్కడ ఏర్పడిన ద్వారం గుండా ఆమె లోపలికి ప్రవేశించింది. మరొక విశాలమైన సొరంగం కనిపించింది. మరి కొంతదూరం వెళ్ళేసరికి, ఆమె ఒక మహారణ్యం మధ్యకు చేరుకున్నది!



వెన్నెల పిండారబోసినట్టు కాస్తున్నది. అరణ్యమంతా ప్రశాంత గంభీరంగా ఉన్నది. రాణి చల్లటి గాలిని గట్టిగా పీల్చింది. చేతిలో బిడ్డ మళ్ళీ నిద్ర పోయాడు. అదీ మంచిదే అనుకున్నది రాణి. ఎందుకంటే బిడ్డ ఏడ్పు ఏ వన్య మృగాలనైనా ఆకర్షించవచ్చు. ఆమెకు అప్పుడు చెప్పరానంత దాహం వేసింది. అయినా, ఈ అపరాత్రివేళ అడవిలో నీళ్ళ కోసం ఎక్కడని వెతకడం?

దూరంగా నక్కల కూతలు వినిపించాయి. తెల్లవారుతున్నది కాబోలు అని ఆమె బిడ్డను ఒడిలో పడుకోబెట్టుకుని, ఒక బండపై కూర్చున్నది. కొంతసేపటికి, ఎక్కడో నీళ్ళు ప్రవహించే శబ్దం ఆమెకు వినిపించింది. ఆమె లేచి ఆ ధ్వని వస్తున్న దిక్కుకేసి నడిచింది. అక్కడ ఒక చిన్న సెలయేరు కనిపించింది. రాణి బిడ్డను పచ్చిక మీద పడుకోబెట్టి, సెలయేటిలో నీళ్ళు తాగివచ్చి, బిడ్డకు పాలిచ్చింది.

బిడ్డ నవ్వుతూ తల్లికేసీ, చుట్టుపక్కల నూతన వాతావరణం కేసీ వింతగా చూడసాగాడు. తూర్పు దిక్కున అరుణోదయమవుతున్నది. నాలుగు వైపులా పక్షుల కలకల ధ్వనులు ఆరంభమయ్యాయి. బిడ్డ, తల్లి ఒడి నుంచి దిగి, వింత వాతావరణాన్ని చూసి ఆనందంతో తప్పటడుగులు వేస్తూ ముందుకు వెళ్ళాడు.

"బాబూ, వెళ్ళకు," అని పిలిచింది రాణి.



బిడ్డ రాణికేసి తిరిగి చూసి నవ్వి, మళ్ళీ ముందుకు నడిచాడు. రాణి లేచి, బిడ్డను పట్టుకోవడానికి ఒక్క అడుగు ముందుకు వేసింది. కాని, నీరసం కారణంగా నిలబడలేకపోయింది. సొమ్మసిల్లి అక్కడే పడిపోయింది.

''వెళ్ళకు బాబూ, వెళ్ళకు!'' అని మెల్లగా పిలువగలిగిందే తప్ప, అంతకు మించి ఏమీ చేయలేకపోయింది.

* * *

అరణ్యంలో నివసిస్తూన్న జయానందుడనే ముని యథాప్రకారం, సూర్యోదయానికి పూర్వమే, సెలయేటి సమీపాన గల వాగులో స్నానానికి బయలుదేరాడు.

ఆ వేకువజామున అక్కడ పసిబిడ్డ కేరింతలు విని, జయానందుడు ఆశ్చర్యంతో చుట్టుపక్కల కలయజూశాడు. దాపులనే ఒక అందమైన బిడ్డ మునిని చూసి ఆనందంతో నవ్వుతున్నాడు. ఏ దివ్యశిశువో దివి నుంచి భువికి దిగి వచ్చిందేమో అనుకుంటూ శిశువును సమీపించాడు ముని.

ఆ బిడ్డ నవ్వుతూ, పిలుస్తున్నట్టు బుల్లి చేతులను పైకెత్తాడు. ముని, బిడ్డను ఆప్యాయంగా ఎత్తుకున్నాడు. బిడ్డ మెడలో బంగారు హారం ఉన్నది. హారం మధ్య పెద్ద పతకం కనిపించింది. పతకం పైన, తామరపుష్పాన్ని తొండంతో పట్టుకున్న ఏనుగుబొమ్మ ఉన్నది. అది రాజకుటుంబానికి చెందిన ముద్రిక అని ముని గ్రహించాడు.

బిడ్డ, చేతులెత్తి పడమటి దిక్కుకేసి చూపుతూ, అటు వంగాడు. ముని ఆ వైపుకేసి నడిచాడు.

ఒత్తుగా ఉన్న పచ్చిక మీద రాణి స్పృహతప్పిపడి ఉన్నది. ముని సెలయేటి నుంచి నీళ్ళు తెచ్చి, ఆమె ముఖం మీద చల్లాడు. ఆమె మెల్లగా కళ్ళు తెరిచి, లేచి కూర్చోవడానికి ప్రయత్నించింది. కాని, సాధ్యపడలేదు.

''తల్లీ ఎవరు నువ్వు?'' అని అడిగాడు ముని ఆమె కేసి వంగి.

"మీరు కరుణతో నన్ను తల్లీ అని పిలిచారు. నన్ను కూతురుగానే భావించండి. ఆ భగవంతుడే మిమ్మల్ని ఇక్కడికి పంపాడు. నేను దురదృష్టవంతురాలయిన ఈ రాజ్యానికి రాణిని. అర్ధరాత్రి సమయంలో శత్రువులు కోటను చుట్టుముట్టారు. అక్కడి నుంచి బిడ్డతో పాటు తప్పించుకోమని నా భర్త నన్ను ఆజ్ఞాపించాడు!" అన్నది రాణి ఎంతో బాధగా.

"నిన్న యువరాజు జన్మదినం కదా?" అని అడిగాడు ముని.

"అవును మహాత్మా, అవును. శత్రువులు, మా బిడ్డ జన్మదిన వేడుకలను తమకు అవకాశంగా ఉపయోగించుకున్నారు!" అన్నది రాణి నీరసంగా, గాలి పీల్చుకోడానికి కూడా ఎంతో కష్టపడుతూ.

"అలాగా! ఇక ఏమీ చెప్పకు. అంతా అర్థమయింది. నీరసంగా ఉన్నావు." అన్నాడు ముని. రాణి విషాదంగా నవ్వింది.

"ఇకపై మాట్లాడడానికి అవకాశమే రాదేమో అన్న భయం నాకు కలుగుతున్నది. భగవంతుడు మీ ద్వారా నా బిడ్డకు రక్షణ కల్పించాడని భావిస్తున్నాను. ఎటువంటి బాధా, భయమూ లేకుండా తృప్తిగా కళ్ళు మూస్తున్నాను. అయితే, రాజుగారు క్షేమంగా ఉన్నారని తెలిస్తే మరింత సంతోషంగా వెళ్ళిపోతాను." అన్నది రాణి.

"బిడ్డా, భగవదనుగ్రహమే లేకుంటే నేను ఇప్పుడిక్కడికి వచ్చి వుండేవాడినేనా? రాజుకు కూడా రక్షణ కల్పించమని కరుణామయుడైన ఆ భగవంతుణ్ణే ప్రార్థిదాం. ఈ తరుణంలో, ఇంతకన్నా మనం చేయగలిగిందేమీలేదు. అంతా భగవదేచ్ఛ!" అన్నాడు ముని.

రాణి చిన్నగా నవ్వింది. పెదవులపై నుంచి నవ్వు దూరం కాకముందే, ఆమె కళ్ళు మూసుకున్నాయి. ముని నాడి పట్టి చూసి, ఇక ఆమె మూసిన కళ్ళు తెరవదని గ్రహించాడు! —(ఇంకావుంది)





# స్వయంకృషి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఒక పెద్ద దేశానికి పాలకుడివైన నువ్వు, ఇంత అర్ధరాత్రివేళ భీతిగొల్పే శ్మశానంలో తిరుగాడుతూండడం చూస్తూంటే, నాకు జాలికలుగుతున్నది. నిన్నీపనికి ప్రోత్సహించినవాడు సామాన్యుడా, గొప్ప మేధావా లేక సర్వసంగపరిత్యాగియై అరణ్యంలో తపస్సు చేసుకునే మహా మునీశ్వరుడా అన్నది అంత ముఖ్యం కాదు. ఏదో ఒక కార్యాన్ని సాధించమని తాము ప్రోత్సహించినవాడు, విజయం సాధిస్తూ ఒక్కొక్క మెట్టే ఎక్క పైకి పోతూంటే, చాలామంది వ్యక్తులు క్రమక్రమంగా ఈర్ష్యకూ, ఓర్వలేనితనానికీ

## బేతాళ కథలు



గురి అవుతారు.' పూర్వం సదానందుడనే ముని, విక్రముడనే వాడిపట్ల ప్రవర్తించిన తీరు ఎలాంటిదో చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

మయూరినగర రాజ్యంలో, కాంతిపురం అన్న చిన్న గ్రామం వుండేది. ఆ గ్రామంలో ధర్మయ్య అనే రైతుండేవాడు. అతడికి విక్రముడనేవాడు ఏకైక సంతానం. వాడికి చదువు మీద ధ్యాస వుండేదికాదు. కాని తల్లి చెప్పే కథలంటే మాత్రం తగని ఆసక్తి. ఆ కథలు విన్న వాడికి, అరణ్యంలో తపస్సు చేసుకునే మునులకు గొప్ప మహిమలుంటాయనీ, వాళ్ళ దగ్గర మంత్రాలు నేర్చుకుంటే, ఏదైనా సాధించవచ్చనీ నమ్మకం ఏర్పడింది.

ఒక రోజున ధర్మయ్య, విక్రముణ్ణి పిలిచి, ''ఒరే, ఇంత వయసొచ్చినా నీకు చదువు సంధ్యలబ్బలేదు. ఇకనుంచి నాకు వ్యవసాయప్పనుల్లో సాయపడుదువు గాని, ఇవ్వాళ మన గొర్రెలను తోలుకుపోయి మేపుకురా,'' అని చెప్పాడు.

విక్రముడు గొర్రెలను అరణ్యప్రాంతాన వున్న పచ్చిక బీడులలోకి తోలుకుపోయి, అక్కడ వాటిని వదిలి, ఒక చెట్టుబోదె నానుకుని కొంచెంసేపు నిద్రపోయాడు. వాడికి మెలుకువ వచ్చేసరికి గొర్రెలు కనిపించలేదు. వాడు వాటిని వెతుకుతూ అరణ్యంలో కొంతదూరం పోయేసరికి, ఒక చెట్టుకింద తపస్సు చేసుకుంటున్న మునీశ్వరుడొకడు కనిపించాడు. ఆ ముని పేరు సదానందుడు.

విక్రముడు, ముని కళ్ళు తెరిచేవరకూ, ఆయనకు ఎదురుగా కూర్చుని, ఆయన కళ్ళు తెరవగానే ఎంతో వినయంగా నమస్కరించాడు.

ముని చిరునవ్వునవ్వి, ''ఏం, నాయనా! క్రూరమృగాలు సంచరించే, ఈ అరణ్యానికి ఎందుకొచ్చావు?'' అని అడిగాడు.

అందుకు విక్రముడు, ''స్వామీ, పచ్చికబీడులో మేస్తున్న నా గొర్రెలు తప్పి

పోయాయి. వాటిని వెతుకుతూ ఇటు వచ్చాను,'' అన్నాడు.

ముని క్షణంపాటు కళ్ళు మూసుకుని తెరిచి, ''నీవు నిద్రలో వుండగా గొర్రెలు సురక్షితంగా, నీ ఇల్లు చేరాయి. చీకటి పడవస్తున్నది. క్రూరమృగాలనుంచి నీకెలాంటి అపాయం కలగకుండా, ఈ రుద్రాక్షమాల యిస్తున్నాను. నిర్భయంగా ఇల్లు చేరు,'' అంటూ ఒక రుద్రాక్ష మాలను విక్రముడి కిచ్చాడు.

విక్రముడు రుద్రాక్షమాల తీసుకుని, ''స్వామీ, మీవంటి మునీశ్వరుల దగ్గిర ఎన్నో మహిమలుంటాయని, మా అమ్మ చెప్పింది. నాకు చదువంటే శ్రద్ధలేదు. మీరేదైనా మంత్రం నేర్పితే గొప్పవాణ్ణి అవుదామని వున్నది,'' అన్నాడు.

''నాయనా, మనిషి జీవితంలో రాణించాలంటే, మంత్రతంత్రాలకన్న స్వయంకృషే ఎక్కువ ఉపకరిస్తుంది. చదువు మీద మనసు లగ్నం చెయ్యి. ఒంటరిగా ఇంతదూరం అరణ్యంలోకి వచ్చిన నీవంటి ధైర్యశాలి, జీవితంలో రాణించగలగడం ఏమంత కష్టం కాదు,'' అన్నాడు ముని.

ముని ప్రోత్సాహంతో, ఆ రోజు నుంచి విక్రముడు చదువు మీద మనసు లగ్నం చేశాడు. వాడు రాత్రనక, పగలనక,



చదువుతూ గురువులకు అభిమాన పాత్రుడయ్యాడు. పదిహేనేళ్ళ వయసు వచ్చే సరికి శాస్త్రవిద్యలన్నీ నేర్చుకున్నాడు.

ఒకనాడు విక్రముడు అరణ్యానికి పోయి, సదానందమునితో, ''స్వామీ, మీ ప్రోత్సాహంతో చదువుమీద మనస్సును లగ్నం చేసి వేద, శాస్త్రవిద్యలు అభ్యసించాను. అయినా నాకు తృప్తికలగడం లేదు. జీవితంలో పైకి రావడానికి చదువు మాత్రమే సరిపోదని, నా అభిప్రాయం!'' అన్నాడు.

ముని తలవూపి, ''నీ అభిప్రాయం సరైనదే. ఆత్మరక్షణకూ, శత్రువులను తగినవిధంగా అణచడానికీ, నీ విద్యలు

సరిపోవు. క్షాత్రవిద్యలు నేర్చుకోవాలి. అమ్రపాలిపట్టణంలో జ్వాలాముఖుడనే వీరుడున్నాడు. అతడివద్దకు పోయి, నేను పంపినట్టు చెప్పు. అతడు నీకు అన్ని క్షాత్రవిద్యలూ నేర్పుతాడు,'' అని ఆశీర్వదించాడు.

విక్రముడు అమ్రపాలిపట్టణానికి వెళ్ళి, జ్వాలాముఖుడికి శిష్యుడై, అతనివద్ద అన్ని క్షాత్రవిద్యలూ బహు కొద్ది కాలంలో నే నేర్చుకున్నాడు. ఆ సమయంలో, రత్న భూషణుడనే జమీందారు దగ్గిర నుంచి విక్రముడికి కబురు వచ్చింది. విక్రముడాయనను కలుసుకున్నాడు.

జమీందారు అతడితో, ''విక్రమా, నిన్ను గురించి జ్వాలాముఖుడి ద్వారా విన్నాను. నిన్ను నా అంగరక్షకుడుగా నియమించుకోవాలని వున్నది. సమ్మతమేనా ?'' అన్నాడు.

విక్రముడు అందుకు అంగీకరించి, ఆ రోజే బయలుదేరి సదానందమునివద్దకు పోయి, జరిగినదంతా ఆయనకు వివరంగా చెప్పి,''స్వామీ, ఈ అంగరక్షకుడి ఉద్యోగం, నాకు తగినది కాదని తెలిసీ అంగీకరించాను. వచ్చిన అవకాశాన్ని వృథా చేయకుండా, దాని ఆసరాతో మరొక మంచి ఉద్యోగం సంపాదించాలని, నా ఆలోచన. నా ఆలోచన సరైనదేనా ?'' అని అడిగాడు.

అందుకు సదానందముని, ''నీ ఆలోచన సరైనదే. నీవు మరింతగా అభివృద్ధికి



రావాలని ఆశీర్వదిస్తున్నాను,'' అంటూ విక్రముణ్ణి ప్రోత్సహించాడు.

మయూరినగర మంత్రి సుమంతుడు, రత్నభూషణుడి మంచి స్నేహితుడు, ఆయన ఒకసారి రత్నభూషణుడిని చూడ వచ్చి, మాటల సందర్భంలో, ''మన రాజ్యపు ఆర్థిక పరిస్థితి ఏమీ బాగా లేదు. కోశాగారంలో తగినంత ధనం లేదు. పరిస్థితిని మెరుగుపరచాలంటే, ప్రజల మీద అదనపుపన్నులు వేయాలి. కాని అది రాజుగారికి ఇష్టం లేదు. ఏం చేయాలో పాలుబోవడం లేదు,'' అన్నాడు.

దాపులవుండి, ఆ మాటలు విన్న విక్రముడు వెంటనే, ''మంత్రివర్యా! మీరు మరోలా భావించకపోతే, ప్రజల మీద అదనపుపన్నులు వేయకుండానే, కోశాగారాన్ని నింపే ఉపాయం నేను చెప్ప గలను,'' అన్నాడు.

''ఏమిటా ఉపాయం?'' అని అడిగాడు సుమంతుడు.

''తూర్పు సముద్రంలోని దీవులతో, మన ఇరుగుపొరుగు రాజ్యాలతో వర్తక వ్యాపారాలు చేసే వణిక్ప్రముఖులు, మన రాజ్యంలో ఎందరో వున్నారు. వాళ్ళు రాజుగారికి న్యాయంగా కట్టవలసిన పన్నులు కడుతున్నారో లేదో ఆరా తీయించండి. సమస్య పరిష్కారమవుతుంది,'' అన్నాడు విక్రముడు.

సుమంతుడు, విక్రముణ్ణి మెచ్చుకుని, ''ఈ విషయం యింతవరకూ, మా ఆలో





చనకేరాలేదు! నీ సూచన అద్భుతం,'' అని, రత్నభూషణుడితో, ''మిత్రమా! నీ అంగరక్షకుణ్ణి, నాకు అప్పగించు. ఇక నుంచి నాకు సలహాదారుగా వుంటాడు,'' అన్నాడు.

ఇందుకు రత్నభూషణుడు సమ్మతించాడు.

ఇది విన్న సదానందముని, విక్రముడితో, ''నీ బుద్ధిబలంతో మరికొంత ఉన్నతస్థానాన్ని చేరావు. స్వయంకృషి అంటే యిదే,'' అన్నాడు.

ఒకనాడు దుష్టముఖుడు అనే మాంత్రికుడు, మహారాజు మంజీరనాధుడి సభామంటపానికి వచ్చి, ''రాజా, ఈ భూమండలంలోని, అత్యంత సౌందర్యవతిని వివాహమాడాలని, మంత్రదర్పణంలో చూశాను. నీ కుమార్తె స్వయంప్రభకన్న సౌందర్యవతి మరెక్కడా లేదు. మారుమాట్లాడకుండా, ఆమెతో నా వివాహం జరిపించు. నన్నెదిరించగలశక్తివంతుడు, భూప్రపంచంలో లేడు,'' అన్నాడు.

ఆ మాటలకు ఆగ్రహించిన రాజు మంజీరనాధుడు, ఒర నుంచి కత్తి దూసి, సింహాసనం మీది నుంచి లేచాడు. దుష్టముఖుడు వికటాట్టహాసం చేస్తూ, చేతిలోని మంత్రదండాన్ని గాలిలో తిప్పాడు. మరుక్షణం మంజీరనాధుడి కుడిచేయి, కుడికాలు, చచ్చుబడిపోయి సింహాసనం మీద కూలబడ్డాడు.

దుష్టముఖుడు సభామంటపంలో వున్న వారందరికేసీ, కళ్ళెర్ర చేసి చూస్తూ, ''మీలో ఎవరైనా నన్నెదిరించే ప్రయత్నం చేస్తే, వాళ్ళకూ రాజుగతే పడుతుంది!'' అని హెచ్చరించి, యువరాణి స్వయంప్రభతోసహ మాయమయ్యాడు.

రాజు, మాంత్రికుణ్ణి చంపి తన కుమార్తెను తెచ్చినవాడికి, ఆమెతో వివాహం జరిపి, రాజుగా పట్టాభిషేకం చేస్తానని ప్రకటించాడు.

విక్రముడు అరణ్యానికి వెళ్ళి, సదానందమునితో జరిగింది చెప్పి, ''స్వామీ,

ఇది నాకొక అపూర్వావకాశం. నా ప్రయత్నంలో విజయం కలగాలని ఆశీర్వదించండి!'' అని కోరాడు.

ముని ఒక్క క్షణకాలం కళ్ళు మూసుకుని, ''విక్రమా, ఇది నీ శక్తి, యుక్తులకు గొప్ప పరీక్షవంటిది. దుష్టముఖుడు మహా మాయావి. వాడిని ఎవరూ ఎదుటపడి జయించలేరు. వాడు దండకారణ్యంలోని ఒక సెలయేటి పక్కన వున్న కొండ గుహలో వుంటాడు. వెళ్ళి, విజయం సాధించు!'' అని చెప్పాడు.

విక్రముడు, మాంత్రికుణ్ణి వెతుకుతూ పోయి, కొన్నాళ్ళ తర్వాత, వాడుండే గుహ ప్రాంతాన్ని చేరాడు. వాడికంటబడకుండా, వాణ్ణి చంపడం ఎలాగా అని ఆలోచించి, విల్లంబులు ధరించి, గుహకు చేరువనున్న ఒక మహావృక్షం చాటున దాగాడు.

కొంతసేపటికి మాంత్రికుడు గుహనుంచి బయటికి వచ్చి, సెలయేటికేసి బయలుదేరాడు. ఆ సమయంలో విక్రముడు, ఒక పదునైన బాణాన్ని గురిచూసి, వాడి గుండెల్లో తగిలేలా కొట్టాడు. మరుక్షణం మాంత్రికుడు హాహాకారం చేస్తూ నేలకూలి మరణించాడు.

మాంత్రికుడు మరణించగానే, రాజు మంజీరనాధుడి కాలూ, చెయ్యీ స్వాధీనంలోకి వచ్చినై. యువరాణిని క్షేమంగా



అంతఃపురం చేర్చిన విక్రముడితో, ఆమె వివాహం జరిపించి, అతణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు.

విక్రముడు రాజవుతూనే, పొరుగున వున్న రాజ్యాలను జయించి చక్రవర్తి కావాలని సంకల్పించాడు. ఈ విషయం తెలియపరిచేందుకు సదానందముని వద్దకుపోయి, భక్తిపూర్వకంగా నమస్కరించి, ''స్వామీ, స్వయంకృషితో ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ అభివృద్ధి చెందమనీ, సాధించినదానితో తృప్తిపడవద్దనీ లోగడ ప్రోత్సహించారు,'' అని చెప్పి, పర రాజ్యాలను జయించి చక్రవర్తికావాలన్న తన కోర్కెను వెల్లడించాడు.

ముని అంతా విని, ఆగ్రహంతో, "విక్రమా, మరెన్నడుగాని ఇలాంటి మూర్ఖపుటాలోచనలు చేయకుండా, ఈ నాటినుంచి సాధించినదానితో తృప్తిపడు!" అన్నాడు.

విక్రముడు మారు పలకకుండా నగరం చేరి, ఇతరదేశాలపై దండయాత్ర చేసి చక్రవర్తి కావాలన్న ఆలోచనకు స్వస్తి చెప్పాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, స్వయంకృషితో ఒక్కొక్క మెట్టుగా పైకి పోతూ అభివృద్ధిలోకి రమ్మని ప్రోత్సహించిన ముని, చక్రవర్తి కావాలన్న విక్రముడి కోర్కెను ఎందుకు భంగపరిచాడు? ఇందుకు అసూయా, ఓర్వలేనితనాలు కారణం కాదా? ఒక దేశానికి రాజైన విక్రముడు, ముని కోపగించగానే తన ప్రయత్నాన్ని ఎందుకు విరమించాడు? ముని తన మంత్రశక్తితో ఏమైనా హాని చేయగలడన్న భయంతోనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రతి మనిషి ఎదుగుదలకూ, ఒక పరిమితి వుంటుంది. ఆ పరిమితిని మించిన పెరుగుదల, ఇతరులకు హానీ, ప్రతిబంధకం అయ్యే దశ వచ్చినప్పుడు—ఉన్నదానితోనే తృప్తి పడాలి. చక్రవర్తి కావాలన్న విక్రముడి కోర్కెవల్ల, ఎన్నో యుద్ధాలు జరిగి అపారమైన జననష్టం, ధననష్టం కలుగుతుంది. ముని అందుకే, అతడి ప్రయత్నానికి అభ్యంతరం చెప్పాడు. అంతేగాని, విక్రముడిపై గల అసూయా, ఓర్వలేనితనంవల్ల కాదు. విక్రముడు, ముని మాటల్లోని అంతరార్థాన్ని గ్రహించి తన ప్రయత్నాన్ని విరమించాడు తప్ప, ఆయన మంత్రశక్తికి భయపడలేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ఎస్. శివనాగేశ్వరరావు రచన]





# సామాన్యుడు-మహానుభావుడు

రామన్నకు ఒక్కగానొక్క కొడుకు, నాగన్న. వాడు మంచివాడే కానీ, అమితగారాబంవల్ల పెంకెవాడుగా తయారయ్యాడు. ఒక్కొక్కసారి వాడి నోటికి హద్దూ అదుపూ వుండేదికాదు.

నాగన్నకు పిల్లనిద్దామని వాడి దూరపు బంధువు సూరప్ప, రామన్న ఇంటికి వచ్చాడు. నాగన్నకు విషయం తెలిసి సూరప్పతో వేళాకోళంగా, ''నీ కూతురుకు నీ పోలికలొచ్చాయేమోనని భయంగా వుంది,'' అన్నాడు.

సూరప్ప చటుక్కున, ''భయపడకు! మేము నీకు దూరపు బంధువులమే కానీ, దగ్గిర బంధువులం కాదు. నా కూతురుకు నీ పోలికలేదు. నీపోలికలేకపోతే, ఇంకెవరి పోలికైనా అది అందగత్తేకదా!'' అన్నాడు.

నాగన్న ఉక్రోషంగా, ''నా అందం గురించి తెలిసినవాడివి, ఇంకెక్కడా ఎవరూ దొరకనట్టు, నాకోసమే యింత దూరం ఎందుకొచ్చావు?'' అని అడిగాడు.

అందుకు సూరప్ప చిన్నగా నవ్వి, "దూరపుబంధువువి కదా! మరి, ఆమాత్రం సాయం చేయొద్దూ. నా కూతుర్నిస్తే తప్ప నీకు పెళ్ళికాదని తెలిసి యింతదూరం వచ్చాను,'' అన్నాడు.

అంతే! నాగన్నకు కోపం వచ్చేసింది. వాడు చివాలున అక్కణ్ణించి వెళ్ళిపోయి, తల్లిని పిలిచి, ''ఆడపిల్లనిస్తానని వచ్చిన వాడికింత గర్వమా? ఆయన కూతుర్ని, నేను పెళ్ళిచేసుకోనన్నానని చెప్పు,'' అన్నాడు.

తల్లి వాణ్ణి సముదాయిస్తూ, ''ఒరే, ఇప్పుడు కాదంటే, మళ్ళీ నీకు యింత మంచి సంబంధం రాదు. సూరప్ప కూతురిని ఏడాది క్రితం, నేనొక పెళ్ళిలో చూశాను. పిల్ల బంగారు బొమ్మలా

వుంటుంది. సూరప్పదగ్గిర బోలెడు డబ్బు కూడా వున్నది,'' అని చెప్పింది.

''ఉంటేవుండనీ! నన్ను చిన్నబుచ్చిన వాడి కూతుర్ని, నేను పెళ్ళిచేసుకోను. నేనొకసారి మాటన్నానంటే, అంతే! నన్ను విసిగించకు, వెళ్ళు!'' అన్నాడు నాగన్న చిరాగ్గా.

చేసేదిలేక నాగన్న తల్లి వెళ్ళి, విషయం భర్తకు చెప్పింది. రామన్న, సూరప్పకు చెప్పాడు.

సూరప్ప వెంటనే నాగన్న దగ్గిరకు వెళ్ళి, ''నా కూతుర్ని చేసుకోనన్నావుట. కారణంతెలుసుకోవచ్చా?''అని అడిగాడు.

''నువ్వు నన్ను చిన్నబుచ్చావు. అదే కారణం!'' అన్నాడు నాగన్న.

''నేను నిన్ను చిన్నబుచ్చలేదు. సరదాగా మాట్లాడాను, అంతే! నిజంగా నువ్వంటే అయిష్టమైతే, నా కూతుర్నివ్వాలని మీ ఇంటికి ఎందుకొస్తాను?'' అన్నాడు సూరప్ప.

''ఏదేమైనా సరే! సరదాకూడా నన్నెవరూ చిన్నబుచ్చకూడదు,'' అన్నాడు నాగన్న మొండిగా.

''అలా అనుకునేవాడివి, నువ్వు నన్నెందుకు చిన్నబుచ్చావు?'' అని అడిగాడు సూరప్ప.

''నేను నిన్నెప్పుడు చిన్నబుచ్చాను?'' అన్నాడు నాగన్న ఆశ్చర్యంగా.

''నా కూతురుకు, నా పోలికేమోనని భయమేస్తుందన్నావు. నీకంటే పెద్దవాణ్ణి,



నన్నే నువ్వు అలా అన్నప్పుడు, నేను నిన్నేమైనా అంటే తప్పవుతుందా ?'' అన్నాడు సూరప్ప వాదనకు దిగుతూ.

''అదా సంగతి ! నేనది అప్పుడే మర్చిపోయాను. అయినా నేనెవరినైనా సరదాకేమైనా అంటే, వెంటనే మర్చిపోతాను. ఎందుకంటే, మనసులో దురూహలుంచుకుని మాట్లాడే రకం కాదు నేను,'' అన్నాడు నాగన్న.

''నువ్వు నన్ను సరదాకు వేళాకోళం చేసి మర్చిపోయావు. నేనూ నిన్ను సరదాకు వేళాకోళం చేశాను. కనక వెంటనే మర్చిపో !'' అన్నాడు సూరప్ప.

''నన్నెవరైనా చిన్న మాటన్నాసరే, నాకు జీవితకాలం గుర్తుండిపోతుంది. నీకూ, నాకూ పొసగదు. వెళ్ళిపో.'' అన్నాడు నాగన్న మొండిగా.

సూరప్ప వెంటనే, ''చక్రధరపురంలో సంయముడనే జ్ఞాని వున్నాడు. ఆయన పేరు తెలియనివాళ్ళు దేశంలో వుండరు. ఆయనవీ నీ లక్షణాలే ! ఒకే గుణాలతో సంయముడు మహానుభావుడూ, నువ్వు ఊరూ పేరూ లేని సామాన్యుడూ ఎలా గయ్యారో, నాకు తెలియడం లేదు. నువ్వొకసారి వెళ్ళి ఆయన్ని కలుసుకుంటే, ఆ రహస్యం తెలుసుకుని మహానుభావుడివి కావచ్చు.'' అనేసి వెళ్ళిపోయాడు.

సంయముడిని గురించి, నాగన్న చాలా సార్లు వినివున్నాడు. ఆయన తన లక్షణా



లతో మహానుభావుడయ్యాడని తెలియగానే, వాడిలో కుతూహలం రేగింది. వాడు వెంటనే బయల్దేరి చక్రధరపురం వెళ్ళి, సంయముడిని దర్శించి తన కథ చెప్పుకున్నాడు.

సంయముడు అంతులేని సంపదకు వారసుడు. ఆయనకు భార్యా బిడ్డలున్నారు. దాసదాసీజనమున్నది. ఆయన తనకు తెలిసిన విషయాలను నలుగురికీ చెబుతూంటాడు. ఎందరో తమ సమస్యలను పరిష్కరించుకునేందుకు, ఆయన వద్దకు వస్తారు. ఉన్నది చాలదన్నట్టు ఆయనవల్ల ప్రయోజనం పొందిన భాగ్యవంతులు, ఆయనకు విలువైన కానుకలిచ్చి వెళుతూంటారు.

నాగన్నకు, సంయముడు తనను గురించి చెప్పగానే, వాడు, "అయ్యా, తమరు మహాజ్ఞానులు. తమకున్న అపార జ్ఞానసంపదనూ, ధనసంపదనూ పదిమందికీ పంచిపెట్టడంవల్లనే, తమరు మహానుభావులయ్యారు. మీకూ నాకూ ఒకే లక్షణాలున్నాయని, మా దూరపుబంధువు అబద్ధం చెప్పడంవల్ల, తమ దర్శనం చేసుకునేందుకుయింతదూరంవచ్చాను," అన్నాడు.

సంయముడు నవ్వి, "నాయనా, నీ బంధువు అబద్ధం చెప్పలేదు. మనిద్దరికీ సమాన లక్షణాలున్నాయన్న మాట నిజం. అయితే అందులో చిన్న తేడా వున్నది. ఎదుటివాడు నిన్ను చిన్న మాటన్నా, నువ్వు సహించలేవు. ఎదుటివాడిని చిన్న మాటనడానికూడా మనసొప్పదు నాకు. ఎదుటివాణ్ణి ఎన్నిమాటలైనా అని, యిట్టే మర్చిపోతావు నువ్వు. ఎదుటివాడు నన్ను ఎన్ని మాటలన్నా, యిట్టే మర్చిపోతాను నేను," అన్నాడు.

సామాన్యుడికీ, మహానుభావుడికీ వున్న తేడా ఏమిటో, నాగన్నకు అర్థమైంది. వాడు చక్రధరపురం నుంచి తిన్నగా సూరప్ప వుండే గ్రామం వెళ్ళి, ఆయనకు క్షమాపణలు చెప్పుకుని, ఆయన కూతురుని పెళ్ళాడి కలకాలం సుఖంగా జీవించాడు.



# చందమామ అనుబంధం—13

## మన విజ్ఞాన సంపద

### ఎవరాయన?

పూర్వకాలంలో డెల్ఫీనగర పూజారులు భవిష్యత్తును గురించి చెప్పేవారు. దానిని భవిష్యవాణి అనేవారు. లిడియా నుంచి ఒక దూత డెల్ఫీకి బయలుదేరాడు. తన భవిష్యత్తును తెలుసుకోవడానికి లిడియా రాజు, దూతను అక్కడికి పంపాడు.

కొన్ని కారణాంతరాలవల్ల, డెల్ఫీ పూజారులు ఆగ్రహం చెంది ఆ దూతను అవమానించారు. అతిథిని గౌరవించడం బాధ్యత అనీ, అవమానించడం సబబుకాదనీ అతడు వారికి చెబుతూ, 'డేగ—చిమ్మెట' కథ చెప్పాడు:

ఒకానొకప్పుడు ఒక డేగ, ఒక కుందేలును పట్టుకోవడానికి తరిమింది. కుందేలు డేగనుంచి తప్పించుకోవడానికి, ఒక చిమ్మెటను ఆశ్రయించింది. ఆ కీటకం కుందేలును వదిలివేయమని డేగను ప్రార్థించింది. దాని ప్రార్థనను పెడచెవినిపెట్టి, డేగ కుందేలును తన్నుకుపోయి తినేసింది. ఆ తరవాత, చిమ్మెట డేగ మీద పగసాధించడానికి, అది ఎక్కడ గుడ్లుపెట్టినా కిందికి తోసి పగులగొట్టసాగింది. ఆఖరికి డేగ, బుధుడి ఒడిలో గుడ్లు పెట్టింది. చిమ్మెట పట్టు వదలకుండా బుధుడి ఒడిలోకి చె తచెదారంరాల్చింది. బుధుడు దుమ్ము దులపుకున్నప్పుడు, గుడ్లు కూడా కిందపడి పగిలిపోయాయి. ఆ తరవాత చిమ్మెట, డేగ తన అతిథి అయిన కుందేలును చంపినవైనం తెలియజేసి, తన బాధను బుధుడికి చెప్పుకున్నది. డేగ పెద్ద తప్పు చేసిందనీ, కీటకం చేసినపని న్యాయమైనదనీ బుధుడు కూడా అంగీకరించాడు।

ఈ కథ విన్న పూజారులు మరింత రెచ్చిపోయి, దూతను కొండపైనుంచి కిందికి దొర్లించి చంపేశారు। ఆ దూత ఎవరు?

(36 వ పేజీ చూడండి)

### మీకు తెలుసా?

1. గోవాను ఆక్రమించుకున్న విదేశ ప్రభుత్వం ఏది?
2. దానిని ఆక్రమించిన సేనానాయకుడి పేరేమిటి?
3. హస్తినాపురాన్ని ఎవరు స్థాపించారు?
4. చరిత్రలో సుదీర్ఘమైన భూకంపం ఎప్పుడు ఎక్కడ ఏర్పడింది?
5. వెయ్యి గోరీల నగరంగా ఏ నగరాన్ని పిలుస్తారు?
6. ఒక్కసారిగా సీల్ ఎంతదూరం ఈదగలదు?

(36 వ పేజీ చూడండి)

# మగధ

మనదేశంలోని ప్రాచీన రాజ్యాలలో మగధ ఒకటి. పేరు కాస్త తేడాగా వున్నప్పటికీ, మగధను గురించిన ప్రస్తావన వేదాలలో కూడా ఉన్నది!

పురాణాల ప్రకారం, జరాసంధుడి తండ్రి బృహద్రథుడు ఈ రాజ్యాన్ని స్థాపించాడు. జరాసంధుడు విజృంభించి, పలువురు రాజులను జయించి, తన ఇష్టదైవానికి బలి ఇవ్వడానికి వారిని బంధించాడట. అయితే, భీముడు ఆ దుర్మార్గుణ్ణి మల్లయుద్ధంలో వధించి, రాజులందరినీ విడిపించాడట. జరాసంధుడి తరవాత, మగధను పాలించిన అతని కుమారుడు, భారతయుద్ధంలో పాండవుల పక్షం వహించాడు.

ఇక చారిత్రక యుగానికి వచ్చామంటే బింబిసారుడనే గొప్ప రాజు మగధను పాలించాడు. ఆయన కాలంలోనే మహావీరుడు జైనమతాన్నీ, గౌతమబుద్ధుడు బౌద్ధమతాన్నీ ఈ ప్రాంతంలో ప్రబోధించారు. ఆ ఇరువురి పట్లా బింబిసారుడు గౌరవాదారాలు చూపాడు.

బింబిసారుడి మగధరాజ్య ప్రాంతం ఈనాటి బీహారులో పాట్నా, గయ జిల్లాలుగా పిలువబడుతున్నవి. బింబిసారుడి కుమారుడు అజాతశత్రు — గంగా, సోనానదుల సంగమం వద్ద పాటలీగ్రాం కోటను నిర్మించాడు. ఆ కోటచుట్టూ పెరిగిన నగరాన్ని పాటలీపుత్రం అనీ, కుసుమపురం అనీ పిలిచేవారు. ఈనాడు ఆ నగరాన్ని పాట్నా అని పిలుస్తున్నారు.

మగధ చాలా బలమైన రాజ్యంగా పేరు గాంచింది. అందుకే భూభాగాన్నంతా జయించాలనే కాంక్షతో వచ్చిన గ్రీకుచక్రవర్తి అలెగ్జాండర్ సయితం, ఈ రాజ్యం మీదికి దండెత్తడానికి సాహసించలేకపోయాడు. పాటలీపుత్రం రాజధానీ నగరంగా మనదేశాన్ని పలువురు రాజులు పాలించారు. వారిలో మౌర్యచంద్రగుప్తుడూ, ఆయన మనమడు అశోక

## నిమ్మకాయలు తినడంలో ప్రపంచరికార్డు!

గిన్నిస్‌బుక్‌లో స్థానం సంపాయించడానికి—మూడు నిమ్మకాయల్ని పన్నెండు ముక్కలు చేసి 11.2 సెకండ్లలో తిని సరికొత్తరికార్డు సృష్టించాడు కోయంబత్తూరుకు చెందిన 37 సంవత్సరాల ఎన్. పార్థసారథి. ఈ విషయంలో ఇంతకు పూర్వం రికార్డు సృష్టించిన బాబీకెంప్‌ను తాను అధిగమించినట్టు పార్థసారథి చెబుతున్నాడు.



చక్రవర్తి సుప్రసిద్ధులు! ఈనాటి పాట్నా బీహారురాష్ట్రరాజధానీ నగరం. గయజిల్లా లోని గయ, బుద్ధగయ పట్టణాలను పవిత్రమైనవిగా చెప్పుకుంటారు. ఈనాటి గయలోనే మగధ విశ్వవిద్యాలయం ఉన్నది!

Alexander
Chandragupta
Magadha
Magadha Kingdom
Asoka



## కుర్రవాడి అదృష్టం!

స్విట్జర్లాండులోని మేగియార్ కొలనులో ఒక అయిదేళ్ళ కుర్రవాడు ప్రమాదవశాత్తు పడి మునిగిపోయాడు. ఆ సమయంలో అక్కడ కొందరు నీటిలో మునిగే శిక్షణ పొందుతున్నారు. వాళ్ళు 20 నిమిషాలు ప్రయత్నించి దాదాపు 30 మీటర్ల లోతుకు పోయిన కుర్రవాణ్ణి కొనప్రాణాలతో గట్టుకి చేర్చారు. దగ్గరే వున్న డాక్టర్ చికిత్స చేయడంతో కుర్రవాడు ప్రాణాపాయం నుంచి బయటపడ్డాడు. తల్లిదండ్రులు ఎంతో సంతోషించారు!

# సాహిత్యావలోకనం

1. షేక్స్‌పియర్ జన్మించిన సంవత్సరమే జన్మించిన మేటి ఆంగ్ల నాటకకర్త ఎవరు ?
2. ఆయన ఎప్పుడు ఎలా మరణించాడు ?
3. ఆత్మహత్య చేసుకోవడానికి నిర్బంధించబడిన రోమన్ కవి ఎవరు ?
4. ఆయన్ను నిర్బంధించిన వారెవరు ? ఎందుకు అలా చేశారు ?
5. భారతదేశానికి వెలుపల తన సొంతబాణీలో రామాయణకథను కలిగివున్న దేశం ఏది ?
6. 'సాగా' అంటే ఏమిటి ?

## సమాధానాలు

ఎవరాయన ?

ఈనప్

లోకజ్ఞానం

1. పోర్చుగీసులు
2. అఫెన్సో డీ అల్బుకెర్క్
3. భరతుడి ఐదవతరంవాడైన హస్తినుడు.
4. 1333 వ సం॥ చైనాలో, అది రకరకాలుగా పదేళ్ళపాటు కొనసాగింది ;
5. అల్జీరియాలోని ఎల్‌క్వెడ్ నగరం.
6. అలాస్కన్ సీల్స్ ఐదువేలమైళ్ళు ఈదగలవు.

సాహిత్యం

1. క్రిస్టఫర్ మార్లోన్. 1564 లో.
2. 29 వ యేట. ఒక కొట్లులో పొడిచి చంపారు.
3. ల్యూకన్.
4. నీరోచక్రవర్తి. అతనికి వ్యతిరేకంగా కుట్ర పన్నడంవల్ల.
5. ఇండొనేషియా.
6. ఐస్‌లాండ్‌లోని మధ్య యుగపు వచన గ్రంథాల

# నెహ్రూ కథ–11

ఇండియాకు గవర్నర్ జనరల్‌గా వున్న ఇర్విన్ ప్రభువుకూ, గాంధీజీకి మధ్య చర్చలు జరుగనున్న సమయంలో ఒక యువకుడు నెహ్రూను రహస్యంగా కలుసుకున్నాడు. ఈ ఇరువురి చర్చల తర్వాత జైళ్ళలో వున్న భగత్‌సింగ్ వంటి విప్లవవాదులను విడుదల చేస్తారా అని ఆ యువకుడు అడిగాడు అతడే చంద్రశేఖర్ ఆజాద్!

రెండు మూడు వారాల తరవాత— గాంధీ-ఇర్విన్ చర్చలు జరుగుతూన్న సమయంలో, పోలీసులు అలహాబాదు పార్కులో చంద్రశేఖర్ ఆజాద్‌ను, చుట్టుముట్టి పట్టుకోడానికి ప్రయత్నించారు. ఆజాద్, ఇద్దరు పోలీసులను తుపాకీతో గాయపరచాడు. ఆ సాహస యువకుణ్ణి పోలీసులు అక్కడే కాల్చి చంపారు.





గాంధీజీ, ఇర్విన్‌లు ఇరువురూ ఒక ఒప్పందానికి వచ్చారు. ఆ ఒప్పందం ప్రకారం కాంగ్రెస్ సహాయ నిరాకరణోద్యమం విరమించింది. ఆంగ్ల ప్రభుత్వం, జైళ్ళలో వున్న వేలాదిమంది కాంగ్రెస్ వాదులను విడుదల చేసింది.



జైళ్ళనుంచి విడుదలయిన కాంగ్రెస్ వారికి, ప్రజలు ఘన స్వాగతం పలికారు. అక్కడక్కడాగొప్పగాఅభినందనసభలు జరిగాయి. ఆ సభలలో, గాంధీ–ఇర్విన్ ఒప్పందాన్ని కాంగ్రెస్ సాధించిన ఘన విజయంగానూ, పాలకుల ఓటమిగానూ కాంగ్రెస్ నాయకులు అభివర్ణించారు. ఇది పాలకులకు ఎంతో ఇబ్బందినీ, ఆగ్రహాన్నీ కలిగించింది.

కాంగ్రెస్ సమావేశం కరాచీలో జరిగింది. సర్దార్ వల్లభాయిపటేల్ అధ్యక్షత వహించాడు. గుజరాత్‌లో జన్మించిన ఈ దేశభక్తుడు, గొప్ప జాతీయ నాయకుడుగా రూపొందుతున్నాడు. కరాచీలో కాంగ్రెస్ సభ అమితోత్సాహంతో ప్రారంభమయింది.





సరిహద్దు ప్రాంతం నుంచి వచ్చిన పఠాను నాయకుడు ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ కూడా, కరాచీ కాంగ్రెస్ సభలో గొప్ప నాయకుడుగా గుర్తించబడ్డాడు. ఆయన అనుచరులు ఎర్రచొక్కాలు ధరించడంవల్ల వాళ్ళను 'ఎర్ర చొక్కాలు' అనే పిలిచేవారు. వారందరూ కాంగ్రెస్ పక్షం వహించారు.

రౌండ్‌టేబుల్ సమావేశంలో పాల్గొనడానికి గాంధీజీ లండన్ పయనమయ్యాడు. భారతీయ సమస్యలను పరిష్కరించడానికి ఈ సమావేశం ఏర్పాటుచేయబడినప్పటికీ, దీనివల్ల సంతృప్తికరమైన ఫలితం ఏదీ కలగలేదు.





భారతీయ నాయకులు, తమ దారికి రారని గ్రహించాక, బ్రిటిష్ ప్రభుత్వం తీవ్రమైన అణచివేతలకు పూనుకున్నది. నెహ్రూ బొంబాయిలో రైలుప్రయాణం చేస్తున్నప్పుడు, హఠాత్తుగా రైలు నాపి, పోలీసులు ఆయన్ను ఖైదుచేశారు.

1942, జనవరి 4న గాంధీజీ లండన్ నుంచి తిరిగివచ్చాడు. సర్దార్ పటేల్‌తో పాటు గాంధీజీని కూడా ఖైదుచేశారు. ప్రభుత్వం ప్రజల పౌరహక్కులను నిషేధించింది. స్వాతంత్ర్యయోధులకూ, ప్రభుత్వానికీ మధ్య మంతనాలకు అవకాశం లేకుండా పోయింది.





కొన్నాళ్ళ తరవాత, అలహాబాదులో ఒక ఊరేగింపు జరిగింది. ఊరేగింపుకి నెహ్రూ తల్లి నాయకత్వం వహించింది. పోలీసులు ఊరేగింపును మధ్యలోనే ఆపారు. వృద్ధురాలయిన నెహ్రూ తల్లి మరీ బలహీనంగా వుండడంవల్ల, ఒకడు కుర్చీ తెచ్చాడు. ఆమె కుర్చీలో కూర్చున్నది.

హఠాత్తుగా పోలీసులు లాఠీ ప్రయోగం చేశారు. నెహ్రూ తల్లికి రక్షణగా వున్న, కార్యదర్శినీ మరి కొందరినీ, పోలీసులు ఖైదు చేసి తీసుకువెళ్ళారు. ఊరేగింపును చెల్లాచెదరు చేశారు. నెహ్రూ తల్లిగారిని కుర్చీనుంచి కిందికి తోశారు.





నెహ్రూ తల్లి నేలపై పడిపోయింది. కాని పోలీసులు అంతటితో వదలకుండా ఆమె తల నుంచి రక్తం చిమ్మేట్టు లాఠీలతో కొట్టారు. ఆమెకు స్పృహ తప్పింది. ఆ తరవాత, ఒక అధికారి వచ్చి ఆమెను ఇంటికి చేర్చాడు. జైలులో వున్న నెహ్రూ ఈ వార్త అందగానే, వృద్ధురాలూ, బలహీనురాలూ అయిన తన తల్లి రక్తంలో పడివున్నా ఇంకా తను అహింసా మార్గాన్నే అవలంబించగలనా అని ఆలోచించసాగాడు. —(ఇంకావుంది)



# మూడు ప్రశ్నలు

అనుపమ దేశాన్ని, విక్రమసేనుడనే మహారాజు పరిపాలిస్తూండేవాడు. ఆయనకు ఇద్దరు భార్యలు. పెద్ద భార్య వాసంతి, చిన్న భార్య మాండవి. ఆ ఇద్దరూ వుండేది వేరువేరు భవనాల్లో అయినా, తరుచు కలుసుకుంటూండేవారు. ఇద్దరి మధ్యా సవతి మాత్సర్యం లేకుండా ఒకరినొకరు ఎంతగానో అభిమానించుకుంటూ సొంత అక్కచెల్లెళ్ళలా వుండేవారు. ఇద్దరూ మంచి విద్యావతులూ, సౌందర్యవతులే. అయితే, ఇద్దరిలోనూ మాండవి కాస్త చమత్కార ప్రియురాలు.

ఇక విక్రమసేనుడు మంచి కవేగాక, హాస్య, చతురోక్తులంటే చాలా యిష్టపడుతూండేవాడు. అందుచేత ఆయన తన సభాసదులకు, చమత్కార పూరితమైన సమస్యలిచ్చి, వారి జవాబులు విని ఆనందిస్తూండేవాడు. అప్పుడప్పుడూ మాండవికి సభలో జరిగిన విశేషాలు వినిపిస్తూండేవాడు.

ఒకసారి విక్రమసేనుడు, సభలో జరిగిన ఏదో చమత్కార సంఘటన గురించి మాండవితో ముచ్చటిస్తూండగా, మాండవి, ''ప్రభూ, మీరింతటి చమత్కార ప్రియులూ, కవిరాజులూ కదా! నేను ముచ్చటగా మూడు ప్రశ్నలడుగుతాను. జవాబు చెప్పండి,'' అన్నది ఉత్సాహంగా నవ్వుతూ.

మాండవి మాటలకు రాజు ఎంతో కుతూహలంగా, ''మూడు ప్రశ్నలు అడుగుతావా? ఏదీ అడుగుచూతాం!'' అన్నాడు.

''సరే, వినండి! నా మొదటి ప్రశ్న: తన సౌందర్యాన్ని భర్త ఏవిధంగా ప్రశంసిస్తే, భార్యకు ఎక్కువ ఆనందం కలుగుతుంది? రెండవ ప్రశ్న: ఎంతటి విద్యా

"లలిత"



వతీ, సహనపరురాలూ అయిన స్త్రీ అయినా, భర్త ఒకప్పుడు తిడితే, అది భరించలేని అవమానంగా భావిస్తుంది? చివరిదయిన మూడవ ప్రశ్న: స్త్రీ ఎంతమాత్రమూ సహించలేనిది ఏమిటి?'' అని అడిగింది మాండవి.

భార్య ప్రశ్నలు శ్రద్ధగా విన్న విక్రమసేనుడు, ఎంత ఆలోచించినా జవాబులు చెప్పలేకపోయాడు. ఏవేవో జవాబులు తట్టినై గాని, అవి ఆయనకే అర్థవిహీనంగా తోచాయి.

కొంతసేపు ఆలోచించి, చివరకు గడ్డం నిమురుకుంటూ విక్రమసేనుడు, ''చాలా గడ్డు ప్రశ్నలే అడిగావు!'' అన్నాడు.

మాండవి నవ్వి, ''మరేమనుకున్నారు? పోనీ రేపు సభలో అడిగిచూడండి,'' అన్నది.

మాండవి మాటలు, తాను జవాబు చెప్పలేకపోయినందుకు, ఆక్షేపిస్తున్నట్టుగా తోచాయి విక్రమసేనుడికి. ''సరే, చూద్దాం!'' అంటూ లేచి వెళ్ళిపోయాడు.

మాండవి, భర్త వెళుతున్న వైపు చూసి నవ్వుతూ వూరుకున్నది. విక్రమసేనుడు తిన్నగా వాసంతి అంతఃపురానికి వెళ్ళాడు.

గంభీరంగా వున్న భర్త ముఖం చూసి, వాసంతి కలవరపడుతూ, ''ప్రభూ, అలా వున్నారేమిటి? రాచకార్యాలేమైనా....'' అంటూ ఆగింది.

విక్రమసేనుడు చిరుకోపంగా, ''ఆఁ, నీ చెల్లెలు పెద్ద రాచకార్యమే పురమాయించింది,'' అన్నాడు.

ఆ జవాబు విని, వాసంతి తేలిగ్గా నిట్టూర్చి, ''మాండవా! ఏం చేసింది?'' అంటూ ప్రశ్నించింది నవ్వుతూ.

విక్రమసేనుడు, ఆమెకు అంతా వివరంగా చెప్పాడు.

అంతా విని వాసంతి, ''మీకు వచ్చిన చిక్కు నేను విప్పనా?'' అన్నది.

విక్రమసేనుడు ఆశ్చర్యంగా, ''జవాబులు నువ్వు చెబుతావా? ఊహూఁ, అది బావుండదు,'' అన్నాడు.

''మరేం ఫరవాలేదు. స్త్రీ హృదయం స్త్రీకే తెలుస్తుంది. నేను, మీకు జవాబులు చెబుతాను. మీరు వాటిని, మీరే గ్రహించినట్టుగా, మాండవికి చెప్పండి,'' అని మాండవి అడిగిన మూడు ప్రశ్నలకూ జవాబులు భర్తకు చెప్పింది.

మర్నాటి సాయంత్రం, మాండవి అంతఃపురానికి వచ్చిన విక్రమసేనుడు, మాండవితో, ''చాలా గొప్ప ప్రశ్నలే అడిగావుగాని, జవాబులు చెప్పమంటావా?'' అన్నాడు.

''ఆ జవాబులు మీకే తెలిశాయా?'' అని, వచ్చే నవ్వును ఆపుకుంటూ మాండవి, విక్రమసేనుణ్ణి అడిగింది.

''అవును!'' అన్నాడు విక్రమసేనుడు బింకంగా.

''సరే, చెప్పండి!'' అన్నది మాండవి.

''అయితే, విను! నీ మొదటి ప్రశ్నకు జవాబేమంటే—తనను రంభ, ఊర్వశి అంటూ ప్రశంసించినదానికంటే, వేరొక సౌందర్యవతితో పోల్చి, ఆమెకన్న నువ్వే అందంగా వుంటావు—అంటే స్త్రీ ఎక్కువ సంతోషిస్తుంది," అన్నాడు విక్రమసేనుడు.

''నిజమే! రెండవ ప్రశ్నకు జవాబు?'' అన్నది మాండవి.

''భర్త ఎంత తిట్టినా కూడా భరించగలిగే స్త్రీ, తోడికోడళ్ళముందుగానీ,




సవతులముందుగానీ చిన్న మాట అన్నా, దాన్ని ఏమాత్రం భరించలేని అవమానంగా భావిస్తుంది. ఇదీ నీ రెండవ ప్రశ్నకు జవాబు!'' అన్నాడు విక్రమసేనుడు.

''బావుంది! ఇక, నా ఆఖరి ప్రశ్నకు జవాబు చెప్పండి?'' అని అడిగింది మాండవి.

''స్త్రీ దేన్నయినా సహిస్తుందిగాని, తన ఎదట భర్త మరొక స్త్రీని—ఏ అంశంలోనైనా సరే పొగడడం సహించలేదు. ఇదీ నీ మూడవ ప్రశ్నకు జవాబు!'' అంటూ ఎంతో గర్వంగా ముగించాడు విక్రమసేనుడు.

''ఈ జవాబు మరీ చక్కగా వుంది! అయితే, అక్క సరైన జవాబులే చెప్పి పంపిందన్నమాట!'' అన్నది మాండవి చిన్నగా నవ్వుతూ.

ఆ మాటలకు విక్రమసేనుడు ఉలిక్కి పడి, ''అబ్బే....'' అంటూ ఏదో చెప్ప బోయాడు.

మాండవి సున్నితంగా భర్తను వారిస్తూ, ''నిజాన్ని దాచి ప్రయోజనంలేదు. నిన్న మీరు జాముపొద్దయినా గడవకుండా యిక్కణ్ణించి వెళ్ళిపోయారు. అంటే— యిక్కడినుంచి సరాసరి అక్కదగ్గరకు వెళ్ళివుంటారు. వెళ్ళేటప్పుడు మీ ముఖం కోపంగా, గంభీరంగా వున్నది. అది చూసి అక్క కారణం అడిగివుంటుంది. ఆ కారణం ఏమిటో మీరు చెప్పివుంటారు. అక్క, ప్రశ్నలకు జవాబులు చెప్పి వుంటుంది. అవునా?'' అన్నది చిన్నగా నవ్వుతూ.

ఇక నిజం దాచి లాభంలేదని, విక్రమ సేనుడు కూడా నవ్వి, ''నువ్వు చెప్పిన దంతా నిజమే! ఎలా గ్రహించగలిగావు?'' అని అడిగాడు.

''జవాబులు మీరే గ్రహించగలిగితే, నా తెలివితేటలకు సంతోషించి, ఎంతో ఆనందంగా జవాబులు చెప్పివుండేవారు. కాని, మీరు వస్తూనే, 'చాలా గొప్ప ప్రశ్నలే అడిగావుగాని....' అంటూ నన్ను హేళన చేశారు. జవాబులు చెప్పలేకపోయానన్న మీ ఉక్రోషమే, అలా నన్ను హేళన చెయ్యనిచ్చింది. జవాబులు మీవికావని గ్రహించాక, యింకెవరివో, ఎలా తెలిశాయో ఊహించడం పెద్ద కష్టంకాదు,'' అన్నది మాండవి.

భార్య సునిశితమేధాశక్తి చూసి, విక్రమ సేనుడికి ముచ్చటవేసింది.

''అవును! నువ్వు చెప్పినట్టు, ఉక్రో షంతోనే నిన్ను హేళనచేశాను. కాని, యిప్పుడు నీ ఊహాశక్తికి మనసారా నిన్ను అభినందిస్తున్నాను!'' అంటూ తన మెడలోని ముత్యాలహారం తీసి భార్య మెడలో వేశాడు.





# కృష్ణావతారం

బాణుడి నగరాన్ని చూస్తున్న కృష్ణుడి దగ్గిరికి నారదుడు వచ్చి, "చూశావా కృష్ణా? ఈ పట్టణాన్ని పార్వతీ సమేతుడైన శివుడు స్వయంగా కాపాడుతున్నాడు. అందుచేత నీకు కార్యసిద్ధి అయే మార్గం జాగ్రత్తగా చూసుకో," అన్నాడు.

దానికి కృష్ణుడు చిరునవ్వు నవ్వి. "మా పనికి ఈశ్వరుడే అడ్డుపడినా మా శక్తికొద్దీ మా ప్రయత్నం చేస్తామే గాని, వెనక్కు తిరిగిపోయి, కార్యహాని కానియ్యం," అన్నాడు.

ఇలా అంటూనే కృష్ణుడు నగర ద్వారం వద్దకు వెళ్ళి, పాంచజన్యం పూరించాడు. ఆ నాదం చెవులపడుతూనే బాణుడి సేనలు మహాసముద్రంలాగా వచ్చిపడ్డాయి. కృష్ణుడూ, బలరాముడూ, ప్రద్యుమ్నుడూ, గరుత్మంతుడూ కూడా విజృంభించి ఆ రాక్షస సేనలను దారుణంగా చెండాడారు. చచ్చినవాళ్ళు చావగా మిగిలినవాళ్ళు నగరంలోకి పారిపోసాగారు.

అప్పుడు వాళ్ళను చూసి బాణుడు, "రాక్షసవీరులై పుట్టి, యుద్ధాలలో ఆరితేరి కూడా మీరిలా పారిపోయి వస్తున్నారా? నేను లేనా? నా మంత్రి కుంభాండుడు లేడా? ప్రమథగణాలు లేవా? మన ముందు ఈ శత్రువు ఎంత? ఆగండి! నిలవండి!" అన్నాడు. కుంభాండుడు కూడా వారిని హెచ్చరించాడు. కాని అందువల్ల ప్రయోజనం లేకపోయింది.



రాక్షససేనలు హడలిపోయి ఆగకుండా పారిపోయాయి.

ఈ విధంగా తన భక్తుడైన బాణుడికి కలిగిన అవమానం చూసి శివుడికి ఆగ్రహం వచ్చింది. ఆయన యుద్ధానికి సిద్ధమై, సింహాలు పూన్చిన రథం మీద వృషభ ధ్వజం ప్రకాశిస్తూండగా, నందిని సారథిగా పెట్టుకుని, కుమారస్వామిని కూడా వెంటబెట్టుకుని, ప్రమథ వీరులు వెంట రాగా అట్టహాసంగా బయలు దేరాడు.

శివుడూ, కృష్ణుడూ యుద్ధం ఆరంభించారు. ఆరంభంలోనే శివుడు కృష్ణుడిపైన నూరు బాణాలు వేశాడు. దానికి సమాధానంగా కృష్ణుడు ఐంద్రాస్త్రం ప్రయోగించాడు. దాని నుంచి వేలకొద్దీ బాణాలు వెలువడి శివుడి రథాన్ని కప్పేశాయి. అప్పుడు శివుడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించేసరికి, చుట్టూ మంటలు పుట్టుకొచ్చి బాణాలన్నిటినీ తగలబెట్టేశాయి. ఆ తరవాత అవి తననూ, బలరాముణ్ణీ, ప్రద్యుమ్నుణ్ణీ, గరుత్మంతుణ్ణీ చుట్టు ముట్టుతూంటే కృష్ణుడు వారుణాస్త్రం వేసి ఆ జ్వాలలను చల్లార్చాడు.

అటుపైన శివుడు దారుణమైన అస్త్రాలను అయిదారింటిని ప్రయోగిస్తే వాటన్నిటినీ నిర్వీర్యం చేయగల అస్త్రాలను కృష్ణుడు ప్రయోగించి, చివరకు వైష్ణవాస్త్రాన్ని మంత్రయుక్తంగా ప్రయోగించాడు. ఆ మహాస్త్రాన్ని ఎలా ప్రతిఘటించాలో పాలుపోక శివుడు అమితకోపంతో యుగాంతకమై, ప్రళయ భయంకరమైన పాశుపతాస్త్రాన్ని పైకి తీశాడు.

శివుడి ఉద్దేశాన్ని గ్రహించి కృష్ణుడు అతివేగంగా జృంభకాస్త్రాన్ని ప్రయోగించాడు. మరుక్షణమే శివుడికి చెప్పరాని నీరసమూ, ఆవలింతలూ వచ్చేశాయి. చేతినుంచి ధనుర్బాణాలు పడిపోయాయి.

ఆ సమయానికే బాణుడు కూడా యుద్ధరంగానికి వచ్చి ఉన్నాడు. అతను శివుడికి చైతన్యం కలిగించాలని ప్రయ

త్పించాడు గాని, ప్రయోజనం లేక పోయింది. కృష్ణుడు దిక్కులు మారు మోగేలాగా పాంచజన్యం పూరించాడు.

ఇదంతా చూసి ప్రమథులకు చాలా కోపం వచ్చింది. వారు ప్రద్యుమ్నుణ్ణి చుట్టుముట్టి ఆయుధాలతో ముంచివేశారు. రాక్షసులు కూడా అతని పైన మాయా యుద్ధం సాగించారు. ప్రద్యుమ్నుడు సమ్మోహన విద్యతో వారందరికీ నిద్ర తెప్పించి, రాక్షసులను చంపాడు.

ఈ లోపల కుమారస్వామి, తన తండ్రి యుద్ధవిముఖుడు కావటం చూసి, తానే ఆ స్థానంలో యుద్ధం చేయబూనాడు. అతను కృష్ణబలరామప్రద్యుమ్నులతో పోరాడుతూ, వారిని తీవ్రంగా గాయ పరిచి, తానూ గాయపడ్డాడు. కుమార స్వామి అలిగి కృష్ణుడిపైన బ్రహ్మశిరో నామాస్త్రం ప్రయోగిస్తే, కృష్ణుడు తన సుదర్శన చక్రంతో దాన్ని నిర్మూలిం చాడు. ఆ వెంటనే అతను కుమార స్వామి పైన తన చక్రాన్ని ప్రయోగించే సరికి, అది వచ్చి కుమారస్వామికి తగిలే లోపల లంబాదేవి అనే ఒక దేవతా స్త్రీ వచ్చి కుమారస్వామిని యుద్ధరంగం నుంచి తీసుకుపోయింది.

తనకు అంగరక్షగా ఉన్నవారంతా ఈ విధంగా తొలగిపోగా, యుద్ధంద్వారా తన



చేతుల తీట తీరే అవకాశం దొరికిందని చాలా సంతోషించి బాణుడు తానే స్వయంగా కృష్ణుడితో యుద్ధానికి వచ్చాడు. ఇద్దరికీ జరిగిన భయంకర యుద్ధంలో బాణుడి రథమూ, ఆయుధాలూ నుగ్గయాయి. టెక్కెం విరిగిపడింది. రొమ్ములోనుంచి కృష్ణుడి బాణం దూసుకు పోయి బాణుడు మూర్ఛిల్లాడు.

ఆ స్థితిలో కృష్ణుడి చక్రాయుధానికి బలిగానున్న బాణుణ్ణి కాపాడటానికి శివ పార్వతులు మళ్ళీ లంబాదేవినే పంపారు. ఆమె వచ్చి బాణుడికి అడ్డంగా నిల బడింది. అదృశ్యంగా పార్వతి కూడా అక్కడే నిలబడింది.



అప్పుడు కృష్ణుడామెతో, "దేవీ, ఎందుకీ కుయుక్తులు? నువు అడ్డంగా నిలిచినంత మాత్రాన నేను శత్రువును ప్రాణాలతో వదులుతా ననుకున్నావా?" అన్నాడు.

ఆ మాటకు పార్వతి, "నువు సమర్థుడివి. ఏంచేసినా నేను నిన్ను అడ్డలేను. కాని, ఈ బాణుణ్ణి నేను నా కొడుకుగా పెంచుకున్నాను. నాకు పుత్రశోకం కలిగిస్తావా? వీణ్ణి కాయి," అన్నది.

దానికి కృష్ణుడు, "తల్లీ, వీడు తన వెయ్యి చేతులు చూసుకుని మదించి, విర్రవీగుతున్నాడు. రెండు చేతులే ఉంచి, మిగిలినవన్నీ నరికేస్తేగాని వీడి దర్పం అణగదు. అప్పుడు వీడి రాక్షసత్వం పోయి; నీ అండన బతికే కొడుకులాగే మిగులుతాడు. అడ్డం రాకు," అన్నాడు.

పార్వతి లంబాదేవిని అడ్డం తొలగమన్నది. పార్వతీదేవితోబాటు లంబాదేవి కూడా అంతర్ధానం కాగానే, కృష్ణుడు తన చక్రాయుధాన్ని ప్రయోగించాడు. అది వెళ్ళి బాణుడికి రెండు చేతులను మాత్రం మిగిల్చి, మిగిలిన చేతులనన్నిటినీ ఖండించి, కృష్ణుడి చేతికి తిరిగి వచ్చింది.

అప్పటికీ బాణుడి పౌరుషం చావలేదు. అతను తనకు మిగిలిన రెండు చేతులతోనే ధనుర్బాణాలు తీసుకుని, కృష్ణుడిపై బాణవర్షం కురిపించాడు. కృష్ణుడు ఆగ్రహించి తిరిగి చక్రాన్ని ప్రయోగించబోయేంతలో శివుడు తన పరివారంతో సహా వచ్చి, "కృష్ణా, వీడు నా సంరక్షణలో ఉన్నవాడు. వీణ్ణి చంపి, నా అభయదానాన్ని వ్యర్థం చెయ్యకు. నీ చక్రాన్ని ఉపసంహరించు," అని కోరాడు.

కృష్ణుడు బాణుణ్ణి చంపే ప్రయత్నం మానుకుని, శివుణ్ణి కీర్తించి, గరుత్మంతుణ్ణి ఎక్కి, అనిరుద్ధుడున్న చోటికి వెళ్ళాడు. నందికేశ్వరుడు బాణుణ్ణి శివుడి దగ్గిరికి చేర్చాడు. శివుడు బాణుడికి చేతులు పోయిన బాధ మాన్పి, అతనికి ప్రమథులలో చాలా ఉన్నతమైన స్థానం ఇచ్చి, నందికి సమమైన హోదా ఇచ్చాడు.

బాణుడి పేరు. మహాకాళుడుగా మారి పోయింది. శివుడు అంతర్ధానమయ్యాడు.

అక్కడ గరుత్మంతుణ్ణి చూడగానే అనిరుద్ధుణ్ణి పాముల రూపంలో బంధించిన బాణాలన్నీ, తిరిగి బాణాల రూపం పొంది పడిపోయాయి. అక్కడికి నారదుడు వచ్చాడు, చిత్రరేఖ కూడా వచ్చింది. కృష్ణబలరామ ప్రద్యుమ్నులు అనిరుద్ధుణ్ణి కౌగలించుకున్నారు. అతను వాళ్ళకు భక్తితో నమస్కారాలు చేశాడు.

నారదుడు కృష్ణుణ్ణి చూసి, "ఇంకా ఆలస్యం దేనికి? అబ్బాయికి వివాహం చేసెయ్యి," అన్నాడు.

ముహూర్తం కూడా సమీపంలోనే ఉన్నది. కుంభాండుడు పెళ్ళి ప్రయత్నాలన్నీ పూర్తిచేసి వచ్చి, కృష్ణుడికి నమస్కారం చేసి, "నన్ను తమరు అనుగ్రహించి కాపాడాలి," అన్నాడు.

కృష్ణుడు అతనితో, "నువు చాలా యోగ్యుడివని విన్నాను. బాణుడి నగరం నువే తీసుకుని అనుభవించు," అన్నాడు.

తరవాత ఉషానిరుద్ధులకు వైభవంగా వివాహం జరిగింది. కృష్ణుడు నూతన వధూవరులను శివపార్వతులున్న చోటికి తీసుకుపోయి, వారికి నమస్కారాలు చేయించాడు. ఆ ఆదిదంపతులు వారిని ఆశీర్వదించారు. పార్వతి అనిరుద్ధుడికి వాహనంగా బాణుడి నెమలినే ఇచ్చింది.

ఆ సమయంలో కుంభాండుడు, కృష్ణుడు బయలుదేరి పోబోతుండగా,





సముద్రంలో ప్రవేశించి, అదృశ్యమయాయి.

కృష్ణుడు నిరాశచెంది గరుత్మంతుడితో, "నా ప్రయత్నం ఇలాగయిందేమిటి?" అన్నాడు.

"చేసేటందు కేమున్నది? వరుణుడితో యుద్ధం చేయక తప్పదు!" అన్నాడు గరుత్మంతుడు.

అతను రెక్కలతో బలంగా విసిరేసరికి సముద్రపు నీరు తొలగి, అడుగున నాగలోకం దాకా దృగ్గోచరమయింది. కృష్ణుడు పాంచజన్యం పూరిస్తూ వరుణుడి ఇంటిమీదికి ఎత్తివెళ్ళాడు.

మరుక్షణమే శంఖాలు ఊదుతూ, ఆరవైఆరు రథాలమీద వరుణుడి భటులు కృష్ణుడిపైకి వచ్చారు. కృష్ణుడు వారితో దారుణమైన యుద్ధం చేశాడు. అతనికి సహాయంగా బలరాముడూ, ప్రద్యుమ్నుడూ కూడా పోరాడారు. గరుత్మంతుడు కూడా వారికి సహాయం వెళ్ళాడు. ఈ నలుగురూ చేసిన యుద్ధానికి తట్టుకోలేక వరుణుడి భటులు పారిపోయారు.

"కృష్ణుడు ఇంత పని చేస్తాడా?" అని ఆగ్రహించి వరుణుడు స్వయంగా యుద్ధానికి వచ్చాడు. కృష్ణుడికీ వరుణుడికీ జరిగిన యుద్ధంలో కృష్ణుడు వైష్ణవాస్త్రం ప్రయోగించేసరికి వరుణుడు

"బాణుడి ఆవుల మందలు వరుణుడి దగ్గిర ఉన్నాయి. వాటి పాలు తాగితే ఎంతో బలవీర్యాలు కలుగుతాయి. వాటిని తమరు స్వాధీనపరుచుకోవటం మంచిది," అన్నాడు.

ఇకనేం? కృష్ణుడు గరుత్మంతుడిమీద తనతోపాటు అన్ననూ, కొడుకునూ తీసుకుని పడమటి సముద్ర తీరానికి అతి వేగంగా వెళ్ళి అక్కడి వనాలలో తిరుగుతున్న గోవులను అనేక లక్షల సంఖ్యలో చూశాడు. గోవును మాలిమిచేసుకోవడం తనకు చిన్నతనం నుంచీ అలవాటైన విద్యే గనక, కృష్ణుడు నేలమీద దిగి ఆ గోవుల దగ్గరికి వెళ్ళాడు. అవి గబగబా

ప్రాణంమీదికి వచ్చి, కాళ్ళబేరానికి దిగాడు.

"నన్ను శరణు వేడినంత మాత్రాన లాభం లేదు. నీ దగ్గిర ఉండే బాణుడి పశువులను ముందు నా పరం చెయ్యి." అన్నాడు కృష్ణుడు.

"అది మాత్రం అడగవద్దు. బాణుడు తన పశువులను నాకు అప్పగించేటప్పుడు, ప్రాణం ఉన్నంతదాకా యుద్ధమైనా చేస్తానుగాని వాటిని ఎవరికీ ఇవ్వనని ప్రమాణం చేశాను. ఉన్నమాట చెప్పాను. తరవాత నీ కెలా తోస్తే అలాగే చెయ్యి." అన్నాడు వరుణుడు.

కృష్ణుడు పశువులమీద ఆశ వదులుకుని తన దివ్యాస్త్రాన్ని ఉపసంహరించాడు. వరుణుడు కృష్ణుడికి అతిథి మర్యాదలు చేసి తన లోకం నుంచి సాగనంపాడు.

వరుణుడికి వీడ్కోలు చెప్పి, కృష్ణుడు బలరామ ప్రద్యుమ్న అనిరుద్ధులతో సహా గరుడవాహనం మీద తన నగరాన్ని చేరుకుని, విజయసూచకంగా పాంచజన్యం పూరించాడు. అది విని యాదవ ప్రముఖులు పెద్ద బలగాన్ని వెంటబెట్టుకుని ఎదురు వచ్చారు. వారు వచ్చేసరికి కృష్ణుడు నగరం వెలపల ఉండే ఉద్యానాలలో దిగి, విహరిస్తున్నాడు. అతని వెంట ఇంద్రాది దేవతలు కూడా ఉన్నారు. యాదవులు వారి నందరినీ వైభవోపేతంగా రథాలలో నగరంలోకి తీసుకుపోయారు. కృష్ణుడు విజయుడై తిరిగి వచ్చాడన్న వార్త తెలిసి పురజనులు వీధుల వెంబడి కిక్కిరిసి నిలబడ్డారు. కృష్ణుడు శోణపురంలో అగ్నులను జయించటమూ, శివుణ్ణి నిగ్రహించటమూ, పార్వతికి పుత్రభిక్ష పెట్టటమూ, బాణుణ్ణి చేతులు నరికి ప్రాణాలతో వదలటమూ మొదలైన వృత్తాంతాలు వారు చెప్పుకుంటున్నారు. వారి మాటలు చెవిని పడుతుంటే కృష్ణుడికి ఆనందం కలిగింది.

అక్కడికి చేరగానే కృష్ణుడు తన మందిరానికి వెళ్ళిపోయాడు; ఉషానిరుద్ధులు తమ మందిరానికి వెళ్ళారు.







# వల్లభుడు-వనదేవత

ఒక ఊళ్ళో వల్లభుడనే, కట్టెలుకొట్టి జీవించేవాడుండేవాడు. ఒక రోజున వాడు చీకటితోనే గొడ్డలి భుజాన వేసుకుని, అడవికి బయలుదేరుతూండగా, వాడి భార్య, "రేపు మన అమ్మాయి పుట్టిన రోజు. రోజూకన్న కొంచెం ఎక్కువగా కట్టెలు కొట్టి, సంతలో అమ్మి డబ్బు తీసుకురా," అని చెప్పింది.

వల్లభుడు సరేనని తల ఊపి, అడవి లోకి వెళ్ళాడు. అయితే, మధ్యాహ్నం వరకూ తిరిగినా వాడికి, రోజూ దొరికే అన్ని ఎండుకట్టెలు కూడా దొరకలేదు. సాయంకాలం కావస్తూండడంతో వాడు విసిగిపోయి, దాపులనున్న ఒక పచ్చని చెట్టును నరకబోయాడు.

ఆ మరుక్షణం, వాడి కళ్ళను మిరుమిట్లు గొల్పుతూ, వనదేవత ప్రత్యక్షమై, "ఒరే, బాబూ కొంచెం ఆగు! నువ్వు, ఈ అడవిప్రాంతాన గల ఒకే ఒక గంధపు చెట్టును నరకబోతున్నావు. ఎక్కడా నీకు ఎండినచెట్టు కనబడలేదా ?" అని అడిగింది.

వల్లభుడు తడబడుతూ, "ఇప్పటి పరిస్థితిలో, నాకు ఏ చెట్టయినా ఒకటే. రేపు మా అమ్మాయి పుట్టినరోజు. బహుమతిగా దానికి చిలకబొమ్మ కావాలిట! కట్టెలు కొట్టడం, నా వృత్తి. నేనేం చేసేది!" అన్నాడు.

"మీ అమ్మాయికి, బొమ్మచిలుక బదులు, మాట్లాడేచిలుక నిస్తాను. నువ్వు మాత్రం గంధపుచెట్టును నరకొద్దు," అని వనదేవత చప్పట్లు చరచగానే, ఎక్కడి నుంచో ఒక పంచరంగుల రామచిలుక వచ్చి, వనదేవత భుజం మీద వాలింది. వనదేవత దానిని ముద్దుపెట్టుకుని వల్లభుడికిచ్చింది.

మాచిరాజు కామేశ్వరరావు




వల్లభుడు, చిలుకకేసి చూస్తూ, ''ఇది మాట్లాడగలదా?'' అని అడిగాడు.

''వనదేవత చెప్పాక అనుమానపడితే, నీ కళ్ళు పేలిపోగలవు.'' అన్నది చిలుక.

దాని మాటలు వింటూ వల్లభుడు సంతోషంగా ఇల్లు చేరాడు. ఆసరికి వాడి కూతురు చిలుకబొమ్మ కావాలంటూ, తల్లి దగ్గిర మారాం చేస్తున్నది.

''మంచి పిల్లలు అల్లరి చెయ్యరు. నేను వచ్చా గదా! ఇక యిద్దరం ఒక జట్టుగా వుందాం, సరా!'' అన్నది వల్లభుడి చేతిలో వున్న చిలుక.

అలా మాట్లాడిన చిలుకను చూసి, వల్లభుడి భార్యా, కూతురూ ఆశ్చర్యపోయారు. క్షణంలో చిలుకా, వల్లభుడి కూతురూ నేస్తాలయిపోయారు. చిలుక, ఆ పిల్లకు ఎన్నో కథలు చెప్పింది. రాత్రి నిద్రపోయే సమయంలో వల్లభుడి కూతురు, చిలుకను తన పక్కలోనే పడుకోబెట్టుకున్నది.

జరిగినదంతా తెలుసుకున్న వల్లభుడి భార్య, భర్తతో, ''వనదేవత పుణ్యమా అని, యిక నీకు కట్టెలుకొట్టే శ్రమ తప్పిపోయింది. ఈ చిలుకను నాలుగు వీథులూ కలిసేచోటుకు తీసుకుపో. అక్కడ దానితో మాట్లాడదలచినవాళ్ళ దగ్గిరనుంచి, ఒక వరహా వసూలు చెయ్యి. కనకవర్షం కురిసినట్టవుతుంది,'' అన్నది.

వనదేవత అంతటావిడ బహూకరించిన చిలుకద్వారా, డబ్బు సంపాయించడం యిష్టం లేకపోయినా, భార్య నోటికి జడిసి వల్లభుడు సరేనన్నాడు.

మర్నాడు కూతురు ఏడుస్తున్నా వినక, ఆ పిల్లను ఒక గదిలో పెట్టి తలుపు బిగించి, చిలుకను వల్లభుడి కిచ్చింది వాడి భార్య.

క్షణాల్లో మాట్లాడే చిలుక సంగతి, ఊరంతా తెలిసిపోయింది. జనం వల్లభుడి చుట్టూ గుంపుగా చేరిపోయారు. అదే సమయంలో, వేట నుంచి రాజధానికి తిరిగి పోతున్న తిక్కరాజు అటుగా వచ్చాడు.

ఆయన జనం కేసి ఒకసారి చూసి, పక్కనున్న భటులతో, సంగతేమిటో కనుక్కు రమ్మన్నాడు. వాళ్ళు తిరిగి వచ్చి మాట్లాడే చిలుక సంగతి రాజుకు చెప్పారు.

అది విన్న తిక్కరాజు ఉగ్రుడైపోయి, ''ఆ దౌర్భాగ్యుడు, అటువంటి అపురూపమైన రామచిలుకను నాకు బహూకరించక, తనవద్ద వుంచుకుంటాడా? ఏమా ధైర్యం! వాణ్ణి ఆరు కొరడాదెబ్బలుకొట్టి, మాట్లాడే చిలుకను నా దగ్గరకు తీసుకు రండి,'' అని భటులను ఆజ్ఞాపించాడు.

రాజాజ్ఞప్రకారం భటులు, వల్లభుణ్ణి ఆరు కొరడా దెబ్బలు కొట్టి, చిలుకను తీసుకుపోయారు.

వల్లభుడు పడుతూ, లేస్తూ ఇల్లు చేరాడు. వాడు మామూలు మనిషి కావడానికి పక్షం రోజులు పట్టింది. భార్య, వాడి చేతికి గొడ్డలి యిచ్చి, ''భయం లేదు! ఆ వెర్రిబాగుల వనదేవత అండ మనకున్నది. అడవికిపోయి గంధపు చెట్టును నరకబోతున్నట్టు నటించు. వనదేవత కనబడగానే, ఈ రోజు నా భార్య పుట్టినరోజు, ఏడు పేటల చంద్రహారం కావాలని చెప్పు,'' అన్నది.

వల్లభుడికి భార్య అంటే భయం. వాడామెకు ఎదురుచెప్పలేక, అయిష్టంగా అడవికి పోయి, గంధపుచెట్టును నరకబోయాడు. వెంటనే వనదేవత ప్రత్యక్షమైంది. వాడామెకు భార్య చెప్పమన్నట్టే చెప్పాడు.






వనదేవత గాలిలో చెయ్యి తిప్పి, తళ తళలాడే ఏడు పేటల చంద్రహారం తెప్పించి, వల్లభుడి కిచ్చింది. వాడు దాన్ని తీసుకుపోయి భార్య కిచ్చాడు. ఆమె పరమానందపడిపోయి, దాన్ని మెడలో వేసుకుని, పట్టరాని ఉత్సాహంతో చుట్టు పక్కల ఇళ్ళ వాళ్ళందరికీ ఒకసారి చూపించి వచ్చింది.

ఇది తెలిసిన దొంగ ఒకడు, ఆ రాత్రి వల్లభుడి ఇంట ప్రవేశించి, వాడి భార్య మెడలోని హారాన్ని తెంచుకుని పారిపోయాడు. మెడకు గాయమవడంతో ఆమె తెల్లవార్లూ శోకాలు పెడుతూనే వున్నది.

బాగా తెల్లవారాక వల్లభుడి భార్య, భర్తతో, "ఈ మాట్లాడే చిలుకలూ, చంద్రహారాలూ మనకు అచ్చిరావు. మనం క్షణాలమీద గొప్ప ధనవంతులం అయిపోవాలంటే, అందుకు ఒకేమార్గం వున్నది. వనదేవతకు, ఈ రోజు నీ పుట్టిన రోజని చెప్పు. ఈ రోజు నుంచీ ఏదైనా వ్యాపారం ప్రారంభించాలని వున్నదనీ, అందుకు గాను, ఒక బస్తాడు బంగారునాణాలు కావాలనీ అడుగు. ఆ డబ్బుతో పట్నం పోయి, అందమైన మేడ ఒకటి కట్టుకుని, ఏదైనా వ్యాపారం చేసుకోవచ్చు. ఈ పూరి గుడిసెలో, యిక నేను ఒక్క క్షణమైనా వుండలేను," అన్నది.

వల్లభుడు అడవికిపోయి, యీసారి కూడా అమెకు, భార్య చెప్పమన్నట్టే చెప్పాడు. వనదేవత చెట్టుకేసి చేయి ఊపగానే, దాని కొమ్మలు కదిలి, బంగారు నాణాలబస్తా ఒకటి కిందపడింది. వల్లభుడు ఆ బస్తాను మోయలేక మోస్తూ, ఇంటిదారి పట్టాడు. దారిలో వాడికి, రాజభటు లిద్దరు ఎదురుపడ్డారు. వల్లభుడు, వాళ్ళను చూసి కాస్త కంగారుపడ్డాడు.

అది గమనించిన రాజభటులు, వల్లభుడి కేసి అనుమానంగా చూస్తూ, "ఒరే, ఆ బస్తాలో వున్నదేమిటి?" అని అడిగారు.

వల్లభుడు వణికిపోతూ, ''కుంకుడు కాయలు! కుంకుడుకాయలు!'' అన్నాడు.

రాజభటులు బస్తా మూతి విప్పి చూశారు. లోపల మెరుస్తున్న బంగారు కాసులు, వాళ్ళ కంటబడ్డాయి. వల్లభుడు పెద్ద గజదొంగ అనుకుని, వాళ్ళు వాణ్ణి, తిక్కరాజు దగ్గిరకు లాక్కుపోయారు.

తిక్కరాజు, వల్లభుడు చెప్పేదేమీ వినకుండా, ''గజదొంగ చెప్పేమాటలు నమ్మేంత తిక్కవాణ్ణి కాదు, నేను! ఒకే సారి బస్తాడు కాసులు దోచగలిగావంటే, నువ్వు బహు నేర్పరివైవుండాలి. ఏమైనా, నీవల్ల మా కోశాగారానికి మేలు జరిగింది. అందువల్ల, నీకు కొద్దిపాటి శిక్ష మాత్రమే విధిస్తున్నాను,'' అని భటులచేత పది కొరడాదెబ్బలు కొట్టించి, రెండునెలల కారాగారశిక్ష వేశాడు.

శిక్షాకాలం ముగిశాక, వల్లభుడు ఇంటికి తిరిగి వచ్చాడు. వాడి భార్య తుప్పుపట్టిన గొడ్డలిని వాడి చేతికిచ్చి, ''ఇదుగో, చెప్పేది బాగా విను. తెల్లవారితే అమ్మాయి పుట్టినరోజు. వనదేవత నడిగి మంచి విలువైన బహుమానం పట్టుకురా!'' అని చెప్పింది.

వల్లభుడు, అడవిలో వున్న గంధపు చెట్టు ప్రాంతానికి వెళ్ళలేదు. వాడు మరొక ప్రాంతాన మామూలుకన్న చాలా ఎక్కువ ఎండుకట్టెలు కొట్టి, వాటిని అమ్మిన డబ్బుతో, ఇంటికి అవసరం అయిన వెచ్చాలూ, కూతురుకు చిలుక బొమ్మా కొని తెచ్చాడు.

వల్లభుడి కోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నవాడి భార్య, ''బొమ్మచిలుకను తెచ్చావేం! వనదేవత ఏమన్నది?'' అని అడిగింది కోపంగా.

అందుకు వల్లభుడు ఎంతో శాంతంగా, ''ఆ మధ్య కొట్టిన గాలివానదెబ్బకు గంధపుచెట్టు కూకటివేళ్ళతోపాటు కూలి పోయింది. వనదేవత ఎక్కడా కనిపించ లేదు. పోనీలే, మనం సుఖంగా బతక డానికి, ఆ తల్లి సమకూర్చిన సంపద అడవిలో పుష్కలంగా వున్నది!" అన్నాడు.





# ఔదార్యం

రెండువేల సంవత్సరాల క్రితం చీనా దేశంలో సో-పో-తావూ అనే వృద్ధు డుండేవాడు. ఆయన గొప్ప పండితుడు. కాని ఆయన పాండిత్యానికి మెచ్చి ఆదరించే దాతలులేక దారిద్ర్యం అనుభవించేవాడు.

దూరాన చూ రాజ్యానికి రాజుగా ఉంటున్నవాడు కూడా గొప్ప పండితుడే. ఆయన పండితులను ఆదరించి, దగ్గిర ఉంచుకుని, వస్తువాహనా లిస్తాడని ప్రతీతి. ఆయనవద్దకు వెళ్ళి సన్మానాలు పొందవలిసిందని తావూతో అనేకమంది మిత్రులు చెప్పారు. మిత్రుల మాటలు తోసివెయ్యలేక తావూ తనవద్ద గల కొద్ది పాటి ఉన్నిదుస్తులూ, ధనమూ తీసుకుని చూ రాజ్యానికి కాలినడకను ప్రయాణమయాడు.

అనేకవందల మైళ్ళు వెళ్ళాలి. కొండల మీదుగా కష్టపడి ప్రయాణం చేయాలి. దారిమధ్యలో చలికాలం సంప్రాప్తమయింది. ఎక్కడైనా కొద్దిరోజులు విశ్రాంతి తీసుకుందామని, ఆయన ఒక ఊళ్ళో యాంగ్ - చియావూ - అయీ అనేవాడి ఇంటికి వెళ్ళాడు.

అయీ తావూకు చక్కగా అతిథి సత్కారం చేశాడు. తావూ పండితుడని తెలిసి అయీ మరింత ఆనందించాడు. అయితే, అయీ మాత్రం సామాన్యుడు కాడు. ఆయనవద్ద ఉన్న పాతగ్రంథాలు చూస్తే అయీ తనకంటె చాలా రెట్లు పాండిత్యం గలవాడని తావూకు తెలిసిపోయింది. ఆయనతో పాండిత్య చర్చలు జరిపి తావూ ఈ విషయం మరింత గట్టిగా రుజువుచేసుకున్నాడు.

''చూ దేశపురాజు పండితులను గొప్పగా సత్కరిస్తాడట. ఆయనను చూడబోతున్నాను, నీవుకూడా నావెంట రారాదా?'

చీనా జానపద కథ

అని అడిగాడు తావూ. అయీ ఒప్పుకుని, చలిదుస్తులూ, డబ్బూ తీసుకుని బయలుదేరాడు.

ఇద్దరూ కలిసి కొన్నాళ్ళు ప్రయాణం సాగించిన అనంతరం ఒకనాడు మంచు తుఫాను వచ్చింది. లియాంగ్ పర్వతాల మధ్య వారిద్దరూ ఈ మంచుతుఫానులో చిక్కుకున్నారు. ఇంకా నాలుగురోజులు నడిస్తేగాని వారు చూ దేశం చేరలేరు. కాని ఈ తుఫానులో వారు అడుగు తీసి అడుగు వేసే ఆస్కారం లేదు. వారు చలికి చచ్చిపోయే పరిస్థితి ఏర్పడింది. ముఖ్యంగా ముసలివాడైన తావూ చాలా దీనస్థితిలో ఉన్నాడు. ఆయన అయీతో ఈ విధంగా అన్నాడు:

"నాయనా, నాపని అయిపోయింది. నేనెలాగూ చూ దేశం చేరలేను. నా చలి బట్టలు కూడా నీవే వేసుకుంటివా ముందుకు సాగ గలవు. చూ రాజును సందర్శించగలవు. నా బట్టలిస్తాను, తీసుకో."

దీనికి అయీ ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు. "వెళితే ఇద్దరమూ వెళదాము. లేకపోతే చలికి ఇద్దరమూ చద్దాము. మీ చలిబట్టలు తీసుకుని మీ మరణానికి కారణభూతుణ్ణి కావటానికి అసలే ఒప్పను," అన్నాడు అయీ.

"నాయనా, నీవు యువకుడివి. నేను కాటికి కాళ్ళు చాచుకుని ఉన్నవాణ్ణి. చూ రాజు నాకు సన్మానంచేస్తే ఎంత,



చెయ్యక పోతే ఎంత? అదీకాక, నీవు నాకన్న గొప్ప పండితుడివి!'' అని చెప్పి చూశాడు తావూ. అయీ వినిపించుకోలేదు.

మంచునుంచి తప్పించుకోవటానికి వారిద్దరూ ఒక గుహలో తలదాచుకున్నారు.

''ఎక్కడైనా నాలుగు పుల్లలు దొరికితే చలిమంట వేసుకోవచ్చునే!'' అన్నాడు తావూ. అయీ పుల్లలకోసం బయటికి వెళ్ళాడు.

అయీ తిరిగి వచ్చేలోపుగా తావూ తన చలిబట్టలు విడిచి గుహలో పెట్టి, వెలపల వున్న మంచుగోతిలోకి దూకేశాడు.

అయీ తిరిగి వచ్చి చూసేసరికి గుహలో తావూ బట్టలు మాత్రమే ఉన్నాయి. బయటికి వచ్చి వెతకగా మంచుగోతిలో తావూ శరీరం దొరికింది.

తనకోసం ప్రాణాలు త్యాగం చేసిన తావూ ఔదార్యం తలుచుకుని అయీ చాలా దుఃఖించాడు. ఆయన కాయాన్ని ఆ గుహలోనే భద్రంచేసి, తావూ విసర్జించిన బట్టలు ధరించి, అయీ చూదేశం చేరాడు.

చూ దేశపు రాజు అయీ పాండిత్యానికి సంతోషించి, తన ఆస్థానకవిగా నియమించి, చాలా ధనమూ, వస్తువాహనాలూ ఇచ్చాడు.

ఇంత సన్మానమూ పొందుతూ అయీ కంట తడిపెట్టటం రాజు గమనించి కారణమేమని అడిగాడు.

''ప్రభూ! నా పాండిత్యాన్ని మీరింతగా గౌరవిస్తున్నారు. అయినా, తావూ ఔదార్యం ముందు నా పాండిత్యం ఏపాటి?'' అన్నాడు అయీ.

తావూ చేసిన త్యాగం విని రాజు చాలా ఆశ్చర్యపడ్డాడు. ఆయన అయీతో సహా, తావూ కాయం భద్రంచేసిన గుహవద్దకు వెళ్ళి, వైభవంగా తావూకు అంత్యక్రియలు చేయించి, అక్కడే సమాధి కట్టించాడు.

అయీ ప్రతిఏడూ, ఆ సమాధి వద్దకు వెళ్ళి అశ్రుతర్పణాలు విడిచివస్తూ ఉండేవాడు. ఆయన అనంతరం చీనాదేశంలోని కవి పండితులకు తావూ సమాధి ఒక గొప్ప యాత్రాస్థలం అయింది.





# కష్టే ఫలీ!

రామాపురం అనే గ్రామంలో కృష్ణయ్యా, గోపయ్యా అనే వాళ్ళు ఇద్దరు కలిసి ఒక తోట కొన్నారు.

కృష్ణయ్యకు తోటపని కొంచెం కూడా రాదు. అతను అస్తమానమూ భగవంతుణ్ణి ధ్యానిస్తూ ఉండేవాడు.

గోపయ్యకు తోటపని బాగా తెలుసు. అతను అస్తమానమూ తోటలోనే పని చేసేవాడు. పిచ్చిమొక్కలు పీకి పారెయ్యటమూ, చెట్లకు పాదులు చెయ్యటమూ, నీరు కట్టటమూ—ఇలాటి పనులతోనే రోజంతా అతనికి గడిచిపోయేది.

ఆ ఏడు తోట బాగా కాసింది. కాయలూ, పళ్ళూ అమ్మగా బోలెడంత డబ్బు వచ్చింది. ఆ డబ్బును భాగస్తులు ఎలా పంచుకోవాలన్న సమస్య కూడా వచ్చింది. వచ్చిన డబ్బు సమంగా పంచుకునేటందుకు ఇద్దరూ ఒప్పుకోలేదు.

''నేను చచ్చేటట్టు రాత్రీపగళ్ళు చాకిరీ చేయటంవల్ల చెట్లు బాగా కాశాయి. నాకు హెచ్చు వాటా రావాలి,'' అన్నాడు గోపయ్య.

''నేను నిశ్చలమైన మనస్సుతో కూర్చుని దేవుణ్ణి ధ్యానించటంవల్ల దేవుడు అనుగ్రహించి మంచి రాబడి వచ్చేటట్టు చేశాడు. అందుచేత నాకే హెచ్చువాటా రావాలి,'' అన్నాడు కృష్ణయ్య.

ఇద్దరూ ఈ విధంగా కొంతసేపు వాదించుకున్న మీదట గ్రామాధికారి వద్దకు వెళ్ళి తమ తగువు తీర్చమన్నారు.

గ్రామాధికారి వారిద్దరి వాదనలూ విని, ''నేను మీ ఇద్దరికీ ఒక చిన్న పని పెడతాను. ఈ రాత్రి ఆ పని పూర్తి చేసుకుని రేపు ఉదయం రండి. అప్పుడు నేను మీ వాటాలు ఎలా ఉండాలో చెబుతాను,'' అన్నాడు.

25–ఏళ్ళనాటి చందమామ కథ

ఆయన వారిద్దరికీ చెరో రెండు మూటలూ వడ్లు ఇచ్చి, "వీటిని దంచి బియ్యం చేసుకురండి," అన్నాడు.

మూటలు తీసుకుని కృష్ణయ్యా, గోపయ్యా ఇళ్ళకు వెళ్ళిపోయారు.

కృష్ణయ్య వడ్లు దంచటానికి ప్రయత్నించక, వడ్లను బియ్యంగా మార్చే భారం భగవంతుడి మీద వేసి, భగవధ్యానం చేసి, పడుకుని నిద్రపోయాడు.

గోపయ్య తెల్లవార్లూ మేలుకుని, ఒక మూటెడు వడ్లు దంచి, దాన్ని మాత్రం బియ్యం చెయ్యగలిగాడు.

ఒక రాత్రివేళ గ్రామాధికారి ఇద్దరి ఇళ్ళ మీదుగా వచ్చాడు. కృష్ణయ్య ఇంట వడ్లు దంచుతున్న అలికిడి లేదు. గోపయ్య ఇంట మాత్రం అలికిడి వినిపించింది.

మర్నాడు కృష్ణయ్యా, గోపయ్యా మూటలతో గ్రామాధికారి వద్దకు వచ్చారు. గ్రామాధికారి కృష్ణయ్య తెచ్చిన మూటలు రెండూ విప్పి చూస్తే వాటిలో ఒక్క బియ్యపు గింజ కూడా లేదు. దేవుడి అనుగ్రహంవల్ల వడ్లన్నీ బియ్యం అయి ఉంటా యనుకున్న కృష్ణయ్య ఆశ్చర్యపోయాడు.

గోపయ్య తెచ్చిన రెండు మూటలలో ఒక మూట నిండా బియ్యమూ, రెండో మూట నిండా వడ్లూ ఉన్నాయి.

"చూశావుటయ్యా, కృష్ణయ్యా. పాటు పడనిదే ఫలితం లేదు. నువు పని చేయకుండా దేవుణ్ణి నమ్ముకున్నావు గాని, ఫలితం లేకుండా పోయింది. కష్టపడకుండా ఊరక కూర్చుంటే ఇంతే జరుగుతుంది. తోట మీద వచ్చిన రాబడి పూర్తిగా గోపయ్య శ్రమ ఫలితమే. నువు కూడా గోపయ్యతో పాటు కష్టం చేసి ఉంటే ఇంకా హెచ్చు ఆదాయం వచ్చి ఉండేది. ఇకముందైనా ఇద్దరూ కలిసి పని చేసి, రాబడి సమంగా పంచుకోండి," అని గ్రామాధికారి చెప్పాడు.

అటు తరవాత కృష్ణయ్య కూడా గోపయ్యతో కలిసి అన్నిపనులూ చేస్తూ వచ్చాడు. ఆదాయం పంచుకునే దగ్గిర వారికి ఎలాటి తగాదాలూ రాలేదు.



## ప్రకృతి వింతలు:



### అతిపెద్ద విత్తనం

సియ్‌చిలీ దీవుల్లో లభించిన కోకో డి మెర్ విత్తనమే ప్రపంచంలోకెల్లా చాలా పెద్ద విత్తనమని చెబుతున్నారు. దీని బరువు 40 పౌండ్లు (18 కి. గ్రా).



### వింత పిల్లి!

పిల్లిజాతికి చెందినదయినప్పటికీ, చిరుతపులి మిగతా పిల్లుల్లా తని పిడికిలిని ముడుచుకోజాలదు. అంతేకాదు; పిల్లులు పొంచివుండి హఠాత్తుగా ఎరమీదికి దూకి పట్టుకుంటాయి. అయితే, చిరుతపులి మాత్రం జంతువుల వెంటబడి తరిమి పట్టుకుంటుంది.



### స్నేహభావంగల పక్షి

ఆఫ్రికాలోని వీవర్‌బర్డ్ అనే ఒక రకం పిట్ట ఎండుగడ్డి పరకలతో, సాంఘిక గృహంలా గూడు కడుతుంది. మొదట పైకప్పు నిర్మించి, ఆ తరవాత దానికింది నుంచి ప్రవేశించడానికి అనుకూలంగా అనేక గదులను నిర్మిస్తుంది.

# మీకు ఎలాంటి వారపత్రిక కావాలి?

సదభిరుచులకు, సత్సంప్రదాయాలకూ ప్రతీకగా, తెలుగువారి హృదయాల్లో ప్రత్యేక స్థానాన్ని చూరగొన్న కుటుంబ పత్రికలు

చందమామ
విజయచిత్ర
వనిత

? ? ? ? ? ? ?

వెలువరిస్తున్న ప్రచురణకర్తలనుంచి
త్వరలో రానున్నది ఓ విశేష వారపత్రిక

? ? ? ? ? ?

యువశక్తిలో నవచైతన్యాన్ని రగిలించడమే ధ్యేయంగా
ప్రారంభం కానున్న ఈ పత్రికకు

## మీరేం పేరు పెడతారు?

## మీకు ఎలాంటి శీర్షికలు కావాలి?

## కథలు, సీరియల్స్ ఎటువంటివి ఆశిస్తున్నారు?

## రాజకీయరంగంలోని పరిణామాలు, పరిశోధనాత్మక వ్యాసాలు ఏవిధంగా వుండాలి?

## సంగీతం, క్రీడలు, సినిమా వంటి శీర్షికలు ఎలా వుండాలనుకుంటున్నారు?

పైన పేర్కొన్న అంశాలేకాక, అభిరుచిగల పాఠకులుగా ఈ నవయువతరం వారపత్రిక ఏవిధంగా రూపొందాలనుకుంటున్నారో — విపులంగా రెండు అరఠావు పేజీలలో మీ అభిప్రాయాలని నవంబర్ 5వ తేదీలోగా పంపించండి.

**ఉత్తమమైన అభిప్రాయాలు, మంచిపేరు సూచించిన పదిమందికి**
**సంక్రాంతి కానుకగా పసందైన బహుమతులు!**

పాఠకుల అభిరుచులకు అనుగుణంగా పత్రికను తీర్చిదిద్దడమే మా ఆశయం. అందుకు సహకరించవలసిందిగా అందరికీ విజ్ఞప్తి చేస్తున్నాము.

మీ సూచనలు పంపవలసిన చిరునామా:

ప్రచురణకర్త
కొత్త వారపత్రిక
చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1990 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



A. L. Syed



S. B. Takalkar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ నవంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/-లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నడకలు నేర్చే చిలకమ్మా! రెండవ ఫోటో: నవ్వుతు కాలం గడపమ్మా!!

పంపినవారు: అరుణ యమ్మార్, మెట్‌పల్లి, కరీంనగర్—(ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/- నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


































న్యూట్రిన్
ఆమ్-రస్

రంగు రంగుల ప్యాక్‌లో ఉన్నది
నోరూరించే మృదు మధురమైన, అసలు
సిసలైన, మామిడి పండ్ల రుచి.



నిజమైన 'మ్యాంగో' దాని సహజమైన రుచులతో

